# సంస్థాన సమస్యలు

దేశోద్ధారక గ్రంథమాల ప్రచురణము ౮



ప్రమాది-ఫాల్గుణము వెల ఆరు అణాలు

55
D.

డా॥ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు

# సంస్థాన సమస్యలు



## మొదటిభాగము.

(౨౩-౬-౩౭ తేదీన కటకములో జరిగిన ఒరిస్సాసంస్థాన ప్రజల ప్రథమ మహాసభాధ్యక్షోపన్యాసము)

## రెండవభాగము.

(౨౭-౧౨-౩౭ తేదీన బెంగుళూరునందొసగిన ఉపన్యాసము.
౩౪ వ పుటనుండి)

అనువాదకుడు:

శ్రీయుతులు జానపాటి సత్యనారాయణగారు.

# మనవి

ఈ గ్రంథముతో ప్రమాది సంవత్సరపు నాలుగవ ప్రచురణమగును. మా నియమానుసారము బహుధాన్య సంవత్సరము ౪౦౦ ల పుటలకుపైగా అందజేసితిమి. కాని ఈప్రమాది సంవత్సరము యుద్ధము ప్రారంభమై కాగితము వెల అతిగా హెచ్చిపోయినందున నియమోల్లంఘన మొనర్చి, కొన్ని పుటలు తగ్గించినందుకు మా ప్రచురణముల పాఠకులను క్షమింప కోరుచున్నాము,

"కాంగ్రెసు-సంస్థానములు" "సంస్థాన సమస్యలు" అను రెండు గ్రంథములు—మూడు ఉపన్యాసములు—దయ చేసిన శ్రీయుతులు డా॥ భోగరాజు పట్టాభి సీతారామయ్య గారికి ప్రత్యేకముగా కృతజ్ఞత లర్పించుచున్నాము.

"ప్రజలు—ప్రభుత్వము" మరియు పైగ్రంథములు ఆంగ్లభాషనుండి ఆంధ్రీకరించి, అనుగ్రహించిన శ్రీయుతులు జానపాటి సత్యనారాయణగారికి కృతజ్ఞతలేగాక హృదయ పూర్వకవందనము లర్పించుచున్నాము.

అన్నివిధముల మాగ్రంథమాలకు తోడ్పడిన ఆంధ్ర సోదరులకు మా అభివందనములు.

విధేయుడు

విక్రమ-చైత్ర శు॥ ౧౦
బుధవారం
సికిందారాబాదు.

వట్టికోట ఆళ్వారుస్వామి
ప్రకాశకుడు

# దేశోద్ధారక గ్రంథమాల

—◆ ఆ శ య ము లు ◆—

ఈ గ్రంథమాల కీర్తిశేషులైన విశ్వదాత, దేశోద్ధారక, కళాప్రపూర్ణ కాశీనాథుని నాగేశ్వరరావుగారి స్మారక చిహ్నముగ స్థాపితమైనది.

ఆంధ్రముతప్ప వేరుభాష లెరుగని ఆంధ్రసోదరులలో ప్రపంచజ్ఞానము కలిగించుటకును, ఆంధ్రసోదరులకు మాతృభాషలో అవసర గ్రంథములను అందుబాటులోనుంచి మాతృభాషాభిమానము కలిగించుటకును సేవచేయుటయే ఈ గ్రంథమాల ముఖ్యఆశయము. ఈ గ్రంథమాలద్వారా ప్రాచీన, ఆధునిక, వాఙ్మయ, రాజకీయ, వైజ్ఞానిక, సాంఘిక విషయములకు సంబంధించిన గ్రంథములు సంవత్సరమునకు నాలుగు (మొత్తముపై ౮౦౦ ల పుటలకు తక్కువ కాకుండ) ప్రచురింపబడుచుండును.

అనుబంధ ప్రచురణములుగా రైతు, వర్తకసోదరులకు సంబంధించినవి ఆంధ్రీకరించి ప్రచురింపబడును.

—* ని య మ ము లు *—

ఈ గ్రంథమాలద్వారా ప్రచురింపబడు గ్రంథములను కొనుటకు లిఖితపూర్వకముగా నొప్పుకొనువారు గ్రంథమాల సభ్యులుగా ఎంచబడుదురు. అట్టి సభ్యులు ప్రథమమున నాలుగు అణాలు ప్రవేశరుసుముక్రిందను, రూపాయ ఎనిమిదణాలు వార్షికమూల్యము క్రిందను యివ్వవలయును.

సంవత్సర మధ్యకాలములో ఎప్పుడు సభ్యులుగా చేరినను వారు సంవత్సరారంభమునుండి సభ్యులుగా నున్నటులే ఎంచబడుదురు. తిరిగి (తెలుగు) సంవత్సరారంభమున మొదటి ప్రచురణమువార్షిక మూల్యముతో వి. పి. చేయబడును. అట్టి వి పి. తిరుగకొట్టబడినచో వారి సభ్యత్వము వి. పి. వ్యయముక్రింద చెల్లుబెట్టుకొనబడునుగాన వారు సభ్యత్వమును కోలుపోయినవారగుదురు. తిరిగి సభ్యత్వమును గోరినయెడల లోగాఅయిన తపాలావ్యయము చెల్లించవలసి యుండును.

అనుబంధ ప్రచురణములు సభ్యులు కొనవలయునను నిర్బంధము లేదు. ఎల్లరకు ఒకేధరకు విక్రయింపబడును.

నట్టికోట ఆళ్వారుస్వామి,
స్థాపకుడు, ప్రకాశకుడు
దేశోద్ధారక గ్రంథమాల,
సికింద్రాబాదు.

---

# దేశోద్ధారక గ్రంథమాల

## సభ్యుల ప్రవేశ పత్రము

ప్రకాశకులు గారికి

నేను మీ గ్రంథమాల నియమములను, ఆశయములను తెలిసికొనినాను. నేను సభ్యునిగా చేరుటకు అంగీకరించుచు, ప్రవేశ రుసుము క్రింద నాలుగు అణాలు, వార్షికమూల్యము క్రింద రూపాయ ఎనిమిదణాలు * తపాలాద్వారా పంపించుచున్నాను, వి. పి. ద్వారా రాబట్టుకొనుటకు కోరుచున్నాను.

సంతకము

పేరు

నివాసగ్రామము.

తపాలాకార్యాలయము.

తాలూకా.

జిల్లా

రసీదు సంఖ్య. తేది.

---

* తా మేవిధాన మవలంబించెదరో దానినిమాత్రముంచి రెండవది కొట్టివేయవలెను.

# విషయసూచిక



## రెండవ భాగము





# సంస్థాన సమస్యలు

## మొదటి ప్రకరణము

---

### సంస్థానప్రజలు—వారిహక్కులు

---

ప్రత్యేక రాష్ట్రమును సంపాదించిన ఒరిస్సారాష్ట్ర ప్రజలగు మీకు మొదట అభినందన వాక్యములు తెల్ప నిండు. మీరు, మొత్తము ఒరిస్సారాష్ట్రమునకు ప్రాతినిధ్యము వహించినవారు కాకపోయినను, ఒరిస్సారాష్ట్రములో చేరిన సంస్థానముల ప్రతినిధులుగా, మీ విజ్ఞానము, నాగరకత, ఒకే విశ్వవిద్యాలయమునకు, రాష్ట్రమునకు చెందినవగుటచే ఒరిస్సా రాష్ట్రమునందలి బ్రిటిష్‌యిండియా భాగమునకు చెందిన ప్రజలకు ఎంత సంబంధముగలదో, మీకునూ అంత సంబంధముగలదు. వారితోనుంచి మిమ్ముల ప్రత్యేకించున దెట్లు? వారి రక్తములో రక్తము, కండలో కండకు చెందిన వారుకారా మీరు? అంతఃశ్శాఖలుగా విభజింపబడియున్న మనమందరము ఒకే భారతజాతికి చెందినవారము. మన మందరము నొకే నాదర్శము కలిగి, ఒకే దేవుని కొల్చు వారము. ఒకే చారిత్రిక ఐతిహ్యముకలవారము. ఒకే సంతతికి చెందినవారలము. పరిపాలనకు సంబంధించిన సరి హద్దులు, నడమంత్రపు అవాంతరములు, ఎట్టి ఊహామాత్రపు సరిహద్దులును మనకు అడ్డుగా నిలచి, సరిహద్దుల కటునిటు

నివసించు ప్రజలు సమానహక్కుల ననుభవించకుండ అడ్డుపడ జాలవు. బ్రిటిష్‌యిండియాకు చెందిన రాష్ట్రప్రజలు కని యున్న నియోజనాధికారములు, సంస్థానప్రజలకు అవసరము లేదని తలంచు బ్రిటిష్‌వారిఊహా ఆశ్చర్యముకల్గించుటలేదా? సంస్థానప్రజలను అబోరిజనులనిగాని, దొంగలగుంపనిగాని బ్రిటిష్‌వారు తలంచిరా? లేక సంస్థానప్రజలను అబలలని గాని, దుర్బలులనిగాని, మూగి, చెవిటివారనిగాని, దివాల కోరులనిగాని బ్రిటిష్‌వారు తలంచిరా? బ్రిటిష్‌యిండియా స్త్రీలకుకూడ ఈ మధ్యనే నియోజనాధికారము ప్రసాదింప బడినది. అయితే, సామానులమోయు రైలుపెట్టెలవలె, పని ముట్లవలె, చూడబడుచూ కష్టములయందును, నష్టముల యందును భాగస్వాములచేయుబడి, ఎట్టి హక్కు లేనివారిగా ఏల చూడబడుచున్నారు? బహుశ బ్రిటిష్‌వారుతమకు లోబడి నట్టి సంస్థానములు, సంస్థానప్రజలు యిట్టి హక్కులకు అనర్హులుగా భావించిరేమో! ఇదియే నిజమగుచో, అందలి లోపము సంస్థానాధీశులపైనై యుండవచ్చును, లేక బ్రిటిష్ వారిపైనై యుండునుగాని, తెలివితేటలందును, దేశభక్తియం దును, త్యాగశక్తియందును, యితరుల కెవ్వరికిని తీసిపోని సంస్థానప్రజలదిమాత్రముకాదు. దక్కన్ సంస్థానప్రజల తోడను, కథియవారు సంస్థానప్రజలతోడను పరిచయ భాగ్యము నాకు కలిగియుండెను. కర్ణాటక, మహారాష్ట్ర ఘూర్జర, సౌరాష్ట్రములకు చెందిన భారతపుత్రు లెవ్వరును నేను ప్రాతినిధ్యము వహించుచున్న బ్రిటిష్‌ప్రజ లెవ్వరికిని, ఏవిషయమునందును తీసిపోరు. మాసంచారమునందు చూచిన

సంస్థానప్రజలెల్లరను బడిపిల్లలతో సహా చురుకైన వారుగను, యోచనాపరులుగను కాన్పించిరి. జాంనగరుకు చెందిన పదు నాల్గుసంవత్సరముల బాలుడు సమాఖ్యవలన సంస్థానప్రజల కెట్టి యుపయోగములు కలవని ప్రశ్నించియుండెను. ఈ రాతిరి మన మిచట విచారించనున్న ప్రథమ సమస్య యియ్యదియే.

కొన్నిప్రశ్నలు

పలువురి దృష్టి నాకర్షింపగల్గిన ఈ సమాఖ్యస్వరూప మెట్టిది? ఈ సమాఖ్యవలన, బ్రిటిష్‌వారికిని, సంస్థానాధీశుల కును, సంస్థానప్రజలకును, బ్రిటిష్‌యిండియా ప్రజలకును, ఎట్టి ప్రయోజనములు కలుగనున్నవి? ఈ సమాఖ్య తీవ్ర విమర్శనలకేలగురి కావలసివచ్చెను? దోషములు ఆదర్శము నందు కలవా, లేక విధానమందా? సంస్థానాధీశుల కిందుగల స్థానమెట్టిది? సంస్థానప్రజల కెంతవరకు యిందు సంబంధము కలదు? అసలీ సంస్థానప్రజలనుగూర్చి సమాఖ్యయం దెచ్చట నైన వివరింపబడినదా? లేనిచో వారి గతి ఏమి? ఈ క్రొత్త పద్ధతిని గూర్చిన బ్రిటిష్‌ప్రజ లేమని అభిప్రాయపడు చున్నారు? భిన్నముఖులైన ఈ నాలుగు రకముల వారికిని సమాఖ్య ఎటుల సమన్వయ మొనర్పగలుగును? మొదలగు నవి వివరింతును.

బ్రిటిష్‌వారి రాజనీతి

ప్రపంచమునందన్ని జాతులకన్న ఆంగ్లేయజాతి బహు తెలివిగలజాతి. వ్యాపారమొనర్చుజాతికి చెందినవారగుటచే ఖాతాదారులను తియ్యనిమాటలతో బుజ్జగించి బొట్టపెట్టు

తెలివి అపారముగాయున్నది. మీరెవరికైనను మన దేశపు వైశ్యునితో ప్రత్యేకపరిచయముకలదా? వైశ్యుడు, మాటల యందు, కొలతలయందు మొరటుతనముగా ప్రవర్తించును. గాని లావాదేవీలయందుమాత్రము మాటసౌమ్యత, వినయము, తీపి కనబరుచును. వ్యాపారమునందుమాత్రము మొగమాటము, పూర్వపరిచయము, మర్యాదలగమనింపడు. అటులనే ఇంగ్లీషువారు తనలోగుట్టును పదగుంభనలతో కప్పిపుచ్చి స్వప్రయోజనముల సాధించుటయేగాక, యితరులను బోల్తాపుచ్చుటయందు అద్వితీయ ప్రజ్ఞావంతులు. మనము కాంగ్రెసుప్రణాళికనుగూర్చి అడుగ, వారు [ఇంగ్లీషు] బాధ్యతాయుత ప్రభుత్వము నిత్తుమని వాగ్దానముగావించిరి. మనము స్వరాజ్యమునుగూర్చి చూచాయగా ప్రస్తావించినంతనే, వారు అధినివేశస్వాతంత్ర మిత్తుమనిరి. మనము సంపూర్ణస్వాతంత్ర్యము మన ఆదర్శమని ప్రకటించగనే, సమాఖ్య నొకదానిని తెచ్చిపెట్టిరి. సమాఖ్య ఆకర్షనీయమైనదే. విస్తీర్ణమునందు మూడవభాగమును, జనాభాయందు నాల్గవభాగమును ఆక్రమించబడిన సంస్థానములకును, బ్రిటిష్‌యిండియాకుచెందిన రాష్ట్రములమధ్యను సమరసభావముగలిగియుండునట్లు వీరందరినికూడను దీయగలిగిన కేంద్రసమాఖ్యయొకటి అవసరము కలదు. బ్రిటిష్‌యిండియా ప్రజలును, సంస్థానాధీశులును మొదట పేరువినగనే భేష్‌భేష్‌యని తలలూపుచూ ఉభయులును మొదటరౌండుటేబిల్ సమావేశమునందు సమాఖ్య ప్రణాళికకు తమసమ్మతి నిచ్చియుండిరి. వివరములకు దిగిన వెంటనే సమిష్టిబాధ్యతతోకూడిన సమాఖ్యయందు తమ హెూ

దాలకును, అధికారములకును భంగముకలుగునను ననుమానము సంస్థానాధీశులకు కలిగి, సమాఖ్య తమకులాభదాయకము కాదని వెనుకంజవేయ మొదలిడిరి. గాంధి-యిర్విన్ సంధి ననుసరించి, నిర్మింపదలచిన సమాఖ్యయను సౌధముయిండియా లాభములకు, ప్రత్యేకాధికారములు, కేంద్రభాధ్యత, సమాఖ్య యను మూడుదూలములపై నిర్మింపబడునని ఆశపడిన సమాఖ్యలోని మొదటిదగు ప్రత్యేకాధికారములు కేవలము ఆంగ్లేయుల లాభముననే ఉద్దేశింపబడినవనియు, భారతీయులకు నష్టదాయకమనియు రాష్ట్రప్రజలు తెలుసుకొనిరి. ఈప్రకారముగా సమాఖ్య సంస్థానాధీశులకుగాని, సంస్థానప్రజలకుగాని, బ్రిటిష్‌యిండియా ప్రజలలాభమునకుగాని కాదనియు, కేవలము ఒక్క ఆంగ్లేయులకుమాత్రమే లాభదాయకమనియు తేలెను. బ్రిటిష్‌యిండియా స్వాతంత్ర్యమును నామమాత్రమొనర్పవలెనను దురుద్దేశ్యముతో భారతదేశీయ సంస్థానాధీశులనుకూడ రంగమునకీడ్చిరి.

### ఈ సమాఖ్యలో సంస్థానప్రజలకు స్థానములేదు

సమాఖ్యలో తమ ఊరుపేరు లేనేలేదని సంస్థానప్రజలు తెలుసుకొనిరి. ప్రధానహక్కులుగాని, ప్రాతినిధ్యహక్కులుగాని, కేంద్రశాసనసభకు సభ్యులనెన్నుకొను హక్కుగాని, ప్రజలుకలిగియుండనిచో సంస్థానాధీశుల చేతుల లోని పనిముట్లుగా నుపయోగింపబడుదురని గాంధిమహాత్ముడు సంస్థానప్రజా సమస్యనుగూర్చి నుడివియుండెను. ౯ కోట్ల జనాభాగల్గిన సంస్థానప్రజలు సమాఖ్యకు విముఖులగుటకే ఒక్క కారణమేచాలును.

రాష్ట్రప్రజల కన్నివిధముల నష్టదాయకమే.

ఇక రాష్ట్రప్రజలనుగూర్చి యాలోచించినచో సంస్థానాధీశులకు కేంద్రశాసనసభల రెంటియందును అనగా శిష్ఠసభయందు ౧౦౪ సభ్యులు, క్రిందిసభకు ౧౨౫ సభ్యులను నియమించుహక్కు సమాఖ్యప్రణాళికయందు కల్పించబడినది. ఈసంస్థానాధీశునిచే నియమింపబడు సభ్యులలో భారతీయోద్యోగులతోబాటు ఆంగ్లేయులుకూడనుందురు. క్రిందిసభకు చెందిన ౧౨౫ సభ్యులు, పైసభకుచెందిన ౧౦౪ సభ్యులు మొత్తము ప్రభుత్వ ముఠాగానేర్పడును. ఒకవైపు మాంటుఫర్డు సంస్కరణములలోని సభ్యుల నియమించుపద్ధతి ఇప్పుడు తొలగించితిమని చెప్పుచూ తిర్గి ఈరూపకముగా ఆదేపద్ధతి చొప్పింపబడుచున్నది. సంస్థాన అంతరంగిక వ్యవహారముల యందు జోక్యముకల్పించుకొనగల హక్కును కలిగియుండరు గాని బ్రిటిష్ యిండియా ప్రజలకు సంబాధించిన అన్నివిషయములందును జోక్యముకల్గించుకొనుహక్కు ఈసంస్థానప్రతినిధులకు కల్పింపబడియున్నది. మరియు సంస్థానాధీశులు కేంద్రప్రభుత్వమునకులోబడి సార్వభౌమ ప్రభుత్వమునకు లోబడినవారగుటచే బ్రిటిష్ యిండియా ప్రజలకనుకూలముగా తోడ్పడక సార్వభౌమ ప్రతినిధియొక్కగాని, కార్యదర్శి యొక్కగాని ఆజ్ఞల శిరసావహించి శాసనసభలయందు కొయ్యబొమ్మలవలె సార్వభౌమప్రతినిధియొక్కగాని, రాజ్యాంగ కార్యదర్శియొక్కగాని కనుసన్నలుమెలంగుచూ చేతుల ఎత్తుమనిన ఎత్తుచూ, దించమనిన దించుచూ బ్రిటిష్ యిండియాయందలి ప్రజోపయోగకార్యము లన్నిటియందును

ఆటంకములు కల్పింతురు. ఈసంస్థానాధీశులచే నియమింపబడిన సభ్యులకు శాసనసభయందలి ఆర్థికవ్యవహారములలోకూడ ఓటింగు హక్కుండుటచే ఆర్థికాభివృద్ధికికూడ వీరిచే ప్రతికూల పరిస్థితులు కల్పింపబడవచ్చును. ఇందుచే నేడు బ్రిటిష్ యిండియాప్రజలు పై తెల్పబడిన కారణములేగాక అనేకములైన యితరకారణములవలనకూడ సమాఖ్యయందుచేరుటకు వ్యతిరేకభావమును సూచించుచున్నారు.

సమాఖ్య దూరముగా యుంచదగినది

ఈసమాఖ్యనుగూర్చి పూర్తిగా గమనించి చూచుచో ప్రతి భారతీయుని భక్షించి బ్రిటిష్‌వారికి లాభమొనగూర్ప బయలుదేరిన రాక్షసిగా కన్పడుచున్నది. అట్లుండియు సంస్థానాధీశులు ఈ రాక్షసిని త్రోసివేయజాలని స్థితియందుండుట శోచనీయము. దక్షిణ యిండియా సంస్థానములు జనాభాయందేమి, భూమ్యాదాయమందేమి, గౌరవ చిహ్నముగా కాల్చబడు తుపాకుల సంఖ్యయందేమి ఆధిక్యతను కల్గియున్న పెద్ద సంస్థానములవారి పాచికలు కొంతవరకు పారవచ్చునుగాని, వారికంటెతక్కువ హోదాయందున్న చిన్న, చిన్న సంస్థానములకు నైతికముగాగల యిబ్బందులను పూర్తిగ నిర్లక్ష్య మొనర్పజాలము.

సంస్థాన ఆంతరంగిక వ్యవహారములు

సంస్థానముల ఆంతరంగిక వ్యవహారములకు సంబంధించినట్టియు, ప్రస్తుత సమస్యనుకూడ మించినట్టియు వెంటనే యోచించి నిర్ణయించవలసిన సమస్య లెన్ని యోగలవు. గాన ఈ రోజున యిచట సమావేశమైన మనము ఒరియా సంస్థాన

ములకు సంబంధించిన సమస్యలగూర్చి యోచింతము. సమాఖ్య, దానివలన రానున్న అనర్థకములకుకూడ తల తన్ను విషయము లెన్నియో యోచించవలసినవిగలవు. 30,000 చదరపుమైళ్లు విస్తీర్ణము కలిగిన ౨౬ సంస్థానముల ప్రతినిధులగు వీరిచట సమావేశమైతిరి. ఇందు ౪౧౨౪౩ చదరపుమైళ్ళ విస్తీర్ణముగల్గి, ౮,౮౬,౭౪౫ జనాభాగల్గి రు ౨౬,౬౦,000 ఆదాయము గల్గినట్టి మయూరభంజ్ వంటి పెద్ద సంస్థానప్రతినిధులును, ౪౬ చదరపుమైళ్ల విస్తీర్ణముతో ౨౪౬౮౦ జనాభాగల్గి, రు ౨,౩౫,000 ఆదాయముగల టైగీరియా వంటి చిన్న సంస్థానములతోసహా యీ సభ యందు పాల్గొనియున్నారు. ఈ సంస్థానముల యన్నిటియం దును యింకనూ ఏదో రూపమున బానిసతనము నిల్చియున్న దనుట అందరికిని తెలిసినవిషయమే. చిన్న చిన్న జమీం దారులవద్ద నేడుకూడ స్త్రీపురుషులను అవివాహితులుగా యుంచి, తమ యిండ్ల ఆడపడుచుల వివాహవేళల యందు కానుకలుగా వీరిని అర్పించువాడుక నిల్చియున్న దనుటలో చిత్రమేమియు లేదు. మరియు నిర్బంధ పెట్టి వర్తకపు గుత్తా పద్ధతులు, నిత్యకృత్యములలో జోక్యములు కల్పించు కొనుట మొదలగునవెన్నియో అన్నిసంస్థానములయందునూ గలవు. ఒరియా సంస్థానములయందంతటను యిందుకు విరుద్ధ మేమియు లేదు.

## పరిపాలనా పద్ధతులు

పరిపాలనాపద్ధతులనుగూర్చి ఈ మధ్య 'అబ్జర్వరు' పత్రికలో ప్రకటింపబడిన వ్యాసములు మూడింటిని ఈ క్రింది

పొందుపర్చుచున్నాను.

"ఇచ్చట సమావేశము కానున్న ఒరిస్సా సంస్థాన ముల ప్రజామహాసభవారు యోచించి నిర్ణయించవలసిన వివిధరకముల సమస్యలు విశేషముగా గలవు. 'భేటి' సమస్య తదితర సమస్య లన్నిటిని మించినదై యున్నది. చేసిన కష్టము నకు కూలియివ్వకపోవుట 'భేటి' యనబడును. ఈ ఎట్టిచాకిరీ పద్ధతి నేటికి దాదాపు అన్ని సంస్థానములలోను అమలు నందున్నది. వాస్తవమునకు ఈ పద్ధతి చాల పురాతనమైనది. పూర్వము కొద్దిరకముల ఎట్టిచాకిరిమాత్ర ముండెడిది. రాజు లనుగూర్చి పూర్వులకు కల్గియుండిన ఉద్దేశ్యముల మూలమున ఎట్టిచాకిరి సర్వత్ర అంగీకరింపబడియుండెను. రాజుగారి కోట గోడ మరమ్మతు చేయవలసియున్నచో ప్రజలు సంతసముతో ఆపనిని చేయుచూ వచ్చిరి. అటులనే, జగన్నాథస్వామివారి రథోత్సవములయందు రథమును లాగుచుండిరి. ప్రజలు ప్రతి సంవత్సరము రథమును లాగుదురు. అదేవిధముగా, డోలోత్స వములు, విమానోత్సవములు మొదలగు దేవుని పండుగల సమయములయందుకూడ ఎట్టిచాకిరి చేయుచుండిరి. ఇందు బాజాభజంత్రీలు, భజనపరులు, దివిటీలవారు, యితర పని పాటలవారు యిందు పాల్గొనుచుండిరి. రాజుల యిండ్లయందు జరుగు శుభాశుభ కార్యములయందు కావలసిన సామాను లన్నియు యిచ్చుటయేగాక అవసర సహాయ మంతయు చేయుచుండిరి. ఈ మొదలగు పనులన్నియు పరుల ఒత్తిడిచే గాక స్వబుద్ధిని యిచ్ఛాపూర్తిగా చేయుచుండిరి. ఇందుకు

౨

ప్రతిఫలముగా రాజులు తమ ప్రజలయందు శ్రద్ధ సాను భూతి కలవారై, పన్నులలో తగ్గింపు, అడవులను స్వేచ్ఛగా ప్రజల ఉపయోగమునకై వదలుట, భూములను రుసుము లేకుండ పండించుకొని అనుభవించుటకు హక్కులిచ్చుట మొదలగు వివిధ సౌకర్యములను కలిగించుచుండిరి.”

“అయితే రోజులుమారినవి. వారిపోట్టవారు పోసు కొనజాలని స్థితియందు ప్రజలున్నారు. పాశ్చాత్యనాగరకతా ఫలితముగా రాజులు, క్రొత్తపోకడలుపోవుచు భోగలాలసు లైరి. పూర్వపురాజుల నైతికబాధ్యతను గుర్తించువారుగా నుండిరి. ఇప్పుడో ఆబాధ్యతలనునవి నశించి ఆ విశ్వాసములు పోయి చట్టనిర్మిత ప్రభువులపద్ధతి అమలునందున్నది. ఏది ఎట్లున్నను, గడచిన ౨౦ సంవత్సరములనుంచి రాజులు తమ ద్రోహబుద్ధిచే క్రొత్తరకముల ఎట్టిచాకిరిని కనిపెట్టుటయందు జయప్రదులైరనుట నిశ్చయము. ప్రజలు వేరుగత్యంతరము లేక శిరసావహించుట తటస్థించెను. చిల్లిగవ్వయివ్వకనే తమ మోటారుప్రయాణముల నిమిత్తము మైళ్లకొలదిరోడ్లను ప్రజ లచే నిర్మింపజేసిరి. వారు వారిభార్యాపిల్లను పోషించుకొను టయేగాక, ప్రజలు ఈరోడ్లకుకావలసిన కంకర మొదలగు సామానులను కారుఅడవులనుంచిఅవసరస్థలములకు చేరవేయిం చబడిరి. మరియు అటులవారి కాయకష్టముచే తయారుచేయ బడినరోడ్లపై ప్రయాణమొనర్చుటకుకూడ ఆప్రజలు నోచు కొనరైరి. విద్యాసంస్థలు, ప్రభుత్వోద్యోగుల మందిరములు కూడ విద్యాపన్నులు సక్రమముగా ప్రజలవద్ద వసూలుచేసి ఎట్టిచాకిరిమూలమున నిర్మింపబడెను. వీటివెంట పులివేటలకు,

ఏనుగులపట్టుకొనుటకు ప్రజలచే ఎట్టిచాకిరి చేయించుకొనుట నిత్యకృత్యమైపోయినది. ఈపులివేటలు, ఏనుగులపట్టుట పంట రోజులలో రోడ్లపనులతోబాటు జరుపబడుచుండుట మూలమున రైతులుపొందునష్టమును వూహింపవలసినదియే.

ఎట్టిచాకిరిద్వారా చేయించబడినపనులలో ప్రత్యేకముగా పేర్కొనదగినవి అనేకములుగలవు. కారణాంతరములచే ఆసంస్థానముల పేర్లు పేర్కొనలేదు. ఒకసంస్థానములో సుమారు ౨ లక్షలు విలువచేయు రాజభవనము ఎట్టిచాకిరి ద్వారా కట్టించబడినది. ఈభవనముకుపట్టిన యావత్తు కంకర రాయి మొదలగునవన్నియు రైతుల ఎట్టివలనే మోయించ బడినవి. ఒకసంస్థానమునందలి రాజుగారు మామిడితోట వేయించదలచెను. మామిడివనము వేయించదలచిన స్థలమునందున్న చెట్లునరకుట మొదలుకొని భూమినిదున్నుట, గుంటలుత్రవ్వుట, ఎరువువేయుట, మొక్కలునాటుటతోసహా నీరుపోయుట, కాపలాకాయుట, చెట్టుకుకాయలుకాయువరకు ప్రజలచే ఎట్టిచేయించబడినది.మరొక ఉదహారణతో ఈకథముగింతును. మరొకసంస్థానాధీశుడు ఏనుగులుపట్టునిమిత్తము అడవులలో గుంటలుత్రవ్వుట మొదలగు ఆయేనుగులకొరకు కావలసినయావత్తుపనులు అనగా వరిగడ్డి, వేపకొమ్మలు ఏనుగుల కట్టుటకు త్రాళ్లుపేనుట మొదలగు యావత్తుపనులు రైతులచేత ఎట్టిచేయించబడినది. ఆఏనుగులు విక్రయించుటకు నెలల కొలది పట్టుచుండెను.

౧౯౩౭ సంవత్సరమగు ఈ కాలమునందుకూడ ఈ దురంతరములు సాగుచున్నవి. ప్రకటనలద్వారా దర్బారు

లందును ఎట్టి తొలగించబడినదని బైటి ప్రపంచమునకు తెలియుటకుగాను పెద్ద పెద్ద ప్రకటనలను సంస్థానాధీశులుచేసిరి. ఈ ప్రకటనలు కేవలము భ్రమకొల్పునవైయున్నవి. వాస్తవమునకు కొన్ని సంస్థానములలోని పత్రికటనలయందు రాజుగారింటి శుభాశుభ కార్యములయందును, పులివేట, ఏనుగుల పట్టుట యందు చేయబడుచుండు ఎట్టి మినహాయింపబడ లేదు. ఇంతకంటె ఘోరమేమన, ఒకచెంప ఎట్టి చేయించబడు చున్ననూ, మరొకచెంప ఎట్టి చేయించని సందర్భముల యందు ప్రజలవద్ద ఎట్టికి ప్రత్యామ్నాయముగా డబ్బు వసూలుచేయబడుచున్నది. భూమిపన్నుపై రూపాయిఒకటికి మూడుమొదలు అయిదుఅణాలవరకు వసూలుచేయబడు చున్నది. ఈ అదనపువసూళ్లు యినాంభూములపైకూడ చేయబడుచున్నవి. సాధారణముగా ఈ అదనపువసూళ్లు రీసర్వేసమయములయందు చేయబడుచున్నవి. ధాన్యపుధరలు తగ్గియున్న ఈరోజులలో యిట్టిపన్నులు వసూలుచేయుట మూలమున రైతులస్థితి ఎట్లుండునో ఊహింపుడు. కొందరుసంస్థానాధీశులు అన్నిరకములపనులు ఎట్టిచాకిరిద్వారా చేయించుకొనుటో లేక దానికగుఖర్చును రైతులనుంచి వసూలు చేయుటో పద్ధతిగా పెట్టుకొన్నట్లున్నది.

'నిర్బంధ ఎట్టిచాకిరి నిషేధము'ను చేయకోరుచూ నానారాజ్య పారిశ్రామికసమావేశమువారు ౧౯౩౦ జూనులో తీర్మానించియుండిరి. ఆ తీర్మానముపై చర్య తీసుకొనకోరుచూ యిండియా ప్రభుత్వమువారు 3 మే ౧౯౩౭ తేదీన 'స్టేట్సుమన్' పత్రికలో ఒక ప్రకటన చేసియుండిరి. ఆ ప్రక

టనలో వెట్టిచాకిరి విషయమై, దేశీయ సంస్థానములయందు తీసుకొనబడిన చర్యనుగూర్చి చివర పేరాయందు ఈ ప్రకారము వివరింపబడెను:- "యింతవరకు వెట్టిచాకిరిని నిషేధించు చట్టములు చేయని సంస్థానములవారు వెంటనే వెట్టిచాకిరిని నిషేధించుచూ, బ్రిటిష్ యిండియాయందలి శాసనములవంటి శాసనములు చేయవలెనని ప్రోత్సహింపబడిరి. ఈప్రకారము చేయబడిన శాసనములు సక్రమముగా అమలుజరుగునట్లు చూడవలసినదని రెసిడెంటులకు తెల్పబడినది." గాని ఒరిస్సా సంస్థానములకు సంబంధించినంతవరకు సార్వభౌమ ప్రతినిధి శాఖవారు ఈవిషయమై ఏట్టి చర్య తీసుకొన్నది తెలియదు. వెట్టిచాకిరిని బాగుగా చేయించుకొని సుఖము మరిగిన సంస్థానాధిపతులు ఈ శాసనము విషయమై ఏమాత్రము శ్రద్ధ తీసుకొనక, తమ పూర్వపద్ధతిని నిరాటంకముగా సాగించుచున్నారు. 'స్టేట్సుమన్' పత్రిక యందలి ప్రకటనవలన సంస్థానములయందు వెట్టియున్నదనుటకు ప్రబల నిదర్శనముగా చెప్పవచ్చును. మరియు సంపాదకీయ వ్యాసమునందు ఈ ప్రకారం తెలుపబడెను. "సంస్థానాధీశులనుకూడ ఈ పద్ధతిని అమలుచేయుటకు కోరబడిరి. వారిందు చేరగల్గుటకు, చాలా వెనుకబడియున్నారనియు, చేరుటకు చాలాకాలము పట్టుననుట అందరకు తెలిసినవిషయమే."



# రెండవ ప్రకరణము

## ఒరిస్సా సంస్థానములయందలి వ్యాపార గుత్తా పద్ధతులు

ఎట్టిచాకిరి పద్ధతి ఒరిస్సారాష్ట్ర సంస్థానములయందు అమలుజరుపబడుచున్న విధమును గూర్చి మనము తెలుసుకొంటిమి. ఇంకనూ మరికొన్ని విధముల అన్యాయమార్గములవలంబించి ధనము ప్రజలవద్దనుంచి వసూలుచేయబడుచున్నది. ప్రజాసౌకర్యముల నిమిత్తం కొన్ని శాఖలను ప్రభుత్వములు తమ వశమునందుంచుకొనుట కాంచుచున్నాము. అటులనే యిండియాప్రభుత్వము పోష్టు, టెలిగ్రాఫ్ శాఖ, నల్లమందు తదితర మత్తు పదార్థములకు గుత్తా పద్ధతి అవలంబింపబడినది. గాని, సంస్థానములయం దమలుచేయబడు గుత్తా పద్ధతులు, ప్రజాక్షేమ భంగకరములేగాక, సమర్థింపదగనివైయున్నవి. ప్రజాక్షేమమునందు దృష్టియుంచక, కేవలము సంస్థానాధీశుల పొట్టల నింపుకొను పద్ధతిగా యున్నది. చాలా రకముల వస్తు సముదాయము ఈ అక్రమ గుత్తా పద్ధతియొక్క జాబితాలో చేర్చబడినవి. అందు కొన్నిటిని క్రింద వుదహరించుచున్నాము.

సహజముగా అన్ని రాజ్యములయందును నల్లమందు, గంజాయి గుత్తాపద్ధతిని విక్రయించబడుచున్నవి. యిందు అసహజమేమియు లేదు. కాగితములుచేయుటకై యుపయోగపడు 'సబైగడ్డి' గుత్తపద్ధతికి చెందినదైయున్నది. అయితే

యిందలి దౌర్భాగ్యమేమన ఈ గుత్తాదారులు సాధారణ ముగా రాజబంధువులుగనో, లేక ఆసంస్థానమందలి ఉన్నతో ద్యోగులో యైయుందురు. ఎవరుగుత్తాదారుగా యున్ననూ రాజులకీ అక్రమసంపాదనయందు భాగము తప్పదు. ఒకవుద హరణ జ్ఞాపకమునకు వచ్చుచున్నది. ఒకసంస్థానమందలి పేష్కారునకు, గంజా నల్లమందు గుత్తాలయందు సంబంధము యుండెను. మరొకచోట 'సబైగడ్డి' గుత్తాను సబ్ డివిజనల్ ఉద్యోగికి యివ్వబడినది. మూడవఉదహరణ ఒకచోట తమల పాకులు, బీడీలుచేయుఆకులు గుత్తాపద్ధతి ఏర్పరుపబడి ఒక ఉద్యోగివశము చేయబడినది. అదేమాదిరి మరొకచోట మాంసము, చేపలు, పొగాకు, కొబ్బరికాయలు గుత్తాపద్ధతి క్రిందకు చేర్చబడెను. హెచ్చుమొత్తమునకు గుత్తాలుయివ్వ బడెను. ఈ గుత్తాపద్ధతివలన చెడ్డసరుకు విక్రయింపబడు చుండుటయేగాక తదితరులకు విక్రియింపబడుచుండెను.

గుత్తాజాబితాలో చేర్చబడినవాటిలో ముఖ్యమైనవి ధాన్యము, బియ్యము సంస్థానములలో కరువురాకుండ అరి కట్టుటకనే నెపముతో ఎగుమతి నిషేధింపబడినది. ఆచరణ కేవలము యిందుకు విరుద్ధముగాగలదు. ప్రత్యేకపరిస్థితుల యందు ఎగుమతి చేయదలచువారికి అనుమతిపత్రములు యివ్వబడునని అచ్చుకాగితములలో తెల్పబడెను. గానివాటిలో ఎంతడబ్బు చెల్లించవలసి యుండుననువిషయము తెలుపబడ లేదు. ఎగుమతికిముందు సంచి ఒకటింటికి యింత అని లెఖ్ఖ కట్టి కొంతద్రవ్యమును వసూలుచేసుకొని ఎగుమతిచేసుకొను టకు 'అనుమతిపత్రము' నితురుగాని చెల్లించిన రకమునకు

రశీదు యివ్వబడదు. అనుమతిపత్రము పొందినవాడు తనధా న్యము సంస్థానసరిహద్దుచేరినంత సరిహద్దువద్దయుండు యుద్యోగి వీనిని నిల్పును. అనుమతిపొందినవాడు తీసుకొనిపోవుటకు అనుమతిపొందిన బియ్యము సంచులలెఖ్ఖను తనిఖీ చేయును. ఏకొద్దిహెచ్చుయున్నట్లు కాన్పించినను సరిహద్దును దాటనివ్వక తిరిగిపంపును. తరువాత వానివద్ద విపరీతమొత్తములు అపరాధముక్రింద వసూలుచేతురు. ఒకవేళ నియమిత సంచులు సరిగాయున్న అతని అనుమతిపత్రమును తీసుకొని సరిహద్దును దాటనిత్తురు. దీనివలన తాను ఎగుమతిచేయదల చినప్పుడు పొందు కష్టనష్టముల ఋజువుచేసుకొనుటకెట్టి ఆధారములు లేనివాడగుచున్నాడు. చివరకు ఆతడు ఆధాన్యమును కటక్ నందుగాని, మరేయితర పట్టణమునందుగాని విక్రయించనప్పుడు తనఖర్చులుపోను సాధారణముగా మిగులునది సున్న. పైగామరొకకష్టము కూడకలదు. ఆతడువెళ్లు పట్టణములయందు రాజబంధువులయొక్కగాని, లేక సంస్థానోద్యోగులయొక్కగాని మారుపేర్లతో అడతిదుకాణములుండుటయు, యిష్టమున్ననూ, లేకపోయిననూ ఆఅడతి దుకాణములయందే తమసరుకుల విక్రయించి వారిచ్చినడబ్బుతో సంతుష్టిపడి రావలసివచ్చుటయు జరుగుచుండును. ఎగుమతిచేయబడి ప్రతి ఒక బియ్యపుసంచికి రు ౧-౦-౦ మొదలు రు ౧-౪-౦వరకును, ప్రతి ఒక ధాన్యపుసంచికి ౮ అణాలవంతున వసూలు చేయబడును. ఈదోపిడి సక్రమపద్ధతిపై రాజుగారి ఎరుకపైననే బాహాటముగా జరుగుచుండును. ఈపద్ధతిన ఒక సంస్థానాధీశుడు ౩౦ సంవత్సరములలో కోటిరూప్యములను ప్రోగు

చేసుకొన్నట్లు చెప్పబడుచున్నది.

ధాన్యము ప్రధానపంటయైయున్నది. రైతులు తమకు తమ భార్యాపిల్లలకు పొట్ట, బట్టకును, సర్కారుశిస్తులు చెల్లించుటకును ఈపంటయే ఆధారము. అట్టిసందర్భములయందు వర్తకనష్టమేగాక రైతులు గుత్తాపద్ధతివలన దుర్భరకష్టముల పాలగుచున్నది తెలియగలదు.

ఈ అక్రమ గుత్తాపద్ధతివలన కలుచున్న యిబ్బందులగూర్చి మరి రెండు వుదహరణము ల్రింద యివ్వబడుచున్నవి. చెరుకు రసము తీయు యంత్రములు, రసముకాచు అండాలుకూడ గుత్తా పద్ధతిక్రింద చేర్చబడినవి. ప్రతి సంవత్సరము వీటిని వేలంవేసి, హెచ్చు మొత్తము చెల్లించినవానికి గుత్తా యివ్వబడుచున్నది. ఆ గుత్తాదారుడు రోజుకింత పన్నుయని వసూలుచేయ ప్రారంభించును. కొన్ని సంస్థానముల క్రింద ఉప్పునుగూడ గుత్తా పద్ధతి క్రిందకు చేర్చబడి, వేలమునందు పెద్ద పెద్ద మొత్తములకు గుత్తాల కివ్వబడుచూ వచ్చెను. బ్రిటిష్‌యిండియా యందలి మార్కెట్ల యందు పనికిరానట్టియు, తక్కువ ధరలకు విక్రయించబడునట్టియు చౌకరకపు వస్తువులు, ఈసంస్థానములయందలి మట్టి యిసుక చేర్చబడి విపరీతధరలకు విక్రయించబడుచుండును. ప్రతివస్తువు విక్రయించుటయందును రాజబంధువుల సంబంధము లేకుండ నుండదు. కొన్ని సమయములందు సంస్థానప్రజలకు కావలసినంత ఉప్పు దొరకకపోవుటయు కలదు. అట్టి సమయముల యందు విపరీత ధరలకు కొనుటయో లేక ఉప్పు లేకుండ

బాధపడుటయో జరుగుచుండును. యిట్టి పరిస్థితులే కొన్ని నెలల క్రిందట ఒక సంస్థానమునందు జరిగియుండెను. గుత్తా క్రింద చేర్చబడిన వస్తువులలో పేర్కొనదగినది కిరసనాయిలు. ఈ గుత్తా రాజబంధువున కొకని కివ్వబడుటచే ఆతడు కిరస నాయిలును బంగారంగా మార్చుకొనుచున్నాడు.

ఇట్లు అక్రమపద్ధతుల మూలముగా సంస్థాన ఆదాయ ములు పెరుగుచున్నట్లు ఎక్కడను చూపింపబడుటలేదు. ఈ గుత్తాపద్ధతి ప్రజోపయోగకరమైనదిగాదు. కాకపోవుటయే గాక, అంతకుమించిన చెరుపు గుత్తా యిచ్చు పద్ధతి యందు కలదు. లాలూచి పద్ధతులపై గుత్తాలకివ్వబడుటయు, అటుల గుత్తా తీసుకొన్నవారు, ప్రజలు నిస్పృహ చెందు స్థితికి వచ్చునట్లు బాధించుటయు జరుగుచున్నది. ఇదంతయు. రాజుగారి పరిచయముతో అందు ఈ లాభములలో భాగ స్వామియై చేయబడుచున్నవి. హిందూదేశ శ్రేయోభిలాషు లగువారు ఈ పరిస్థితుల పరికించి, ప్రజలపై, ప్రభువులకుగల బాధ్యతను, ప్రభుత్వమునందు ప్రజలకుగల హక్కు నిరూపణ లను చేయవలసిన సమయ మాసన్నమైనది. ప్రస్తుత పరి స్థితులు ప్రభుత్వ రాజకీయ శాఖవారి కెట్టి గౌరవప్రదమైనవి కావు.

---

# మూడవ ప్రకరణము

## పరిపాలనా లోపములు

ఈవ్యాసమునందు గుజరాతు రాష్ట్రమందలి అధిక సంస్థానముల పరిపాలనపద్ధతులయందు అసమర్థతచే కల్గుచున్నలోపములగూర్చి క్లుప్తముగా విమర్శింపబడును. ఈసంస్థానములయందలి ప్రజల ధనప్రాణములకును, గౌరవమర్యాదలకును భద్రతలేదనుట అతిశయోక్తికాజాలదు. సంఘమునందలి దుండగీండ్లవలన కలుగుప్రమాదములేగాక సంస్థానాధీశుల అత్యాశ, భోగపరాయణత్వములవలనకూడ ప్రమాదము కలుగుచున్నవి. సాధారణముగా అచ్చటి రక్షకభటులు తర్బీతు పొందనివారు. తరచు తమఅధికారమును ప్రజల రక్షణకుగాక అణిచిపెట్టుటకే వినియోగింతురు. తర్బీతు పొందిన పోలీసు ఉద్యోగులు కొద్దిమందియున్ననూ, కట్టుదిట్టములలో నుంచబడక, వారి అభ్యంతరములను, విధులను సక్రమముగా నెరవేర్చకుండ తరుచు సంస్థాననాధీశులు అడ్డుతగిలి జోక్యము కల్పించుకొనుచుందురు. న్యాయశాఖ విషయము కూడ యిటులనే యున్నది. హైకోర్టులని, ప్రధాన న్యాయస్థానములని పెద్ద పెద్ద పేర్ల గొప్పేగాని పసలేదు. న్యాయాధీశునికి న్యాయశాస్త్ర పరిచయమే యుండదు. పైగా సంస్థానాధీశుడు తరుచు నిరంకుశ ఉత్తర్వులద్వారా జోక్యము పుచ్చుకొనుచుండును. బయటి ప్రపంచమునకు తెలియనట్టియు,

ఈసందర్భమున చెప్పదగివిన శేష మొకటికలదు. కొన్ని సంస్థానములలో ద్వంద్వ న్యాయస్థానములున్నవి. ఈ ప్రత్యేక న్యాయస్థానము విపరీత జరీమానలు వేయుటయందు ప్రత్యేక నిపుణత కలిగియున్నవి. ఈప్రకారం వసూలుకాబడిన జరిమాన పైకము సంస్థానాధీశుని స్వంతఖజానాకు చేరును. సంస్థాన ఉద్యోగులకు ఈప్రత్యేక న్యాయస్థానములుండుట తెలియుటయేగాక, తరుచు వారే ఈ న్యాయస్థానములకు పరిష్కారముల నిమిత్తం తగాదాలను తెచ్చుటయందు తోడ్పడుదురు. పోలీసుశాఖ యందును, న్యాయశాఖయందును, గల లోపములవంటి వేముటాటిస్, ముటాండిస్ లయందుకూడ గలదు. ప్రభువులు తలచుచో, ఏ వుద్యోగమునైనను, దరఖాస్తుతోగాని, దరఖాస్తుదారుని అర్హతతోగాని నిమిత్తములేకుండా నియమింపబడును. ఒక్కొక్కప్పుడు మంచి అనుభవజ్ఞులు నియమింపబడుచుందురనుటకు సందేహము లేదు. గాని, వారి నియమిత విధుల నెరవేర్చుటయందుకూడ రాజులు తరచు జోక్యము కల్పించుకొనుచుందురు. సరాసరి తాను పైకమును వసూలు చేయుటో, పరోక్షముగా తన ఏజెంటుద్వారా వసూలు చేయించుటో రాజు చేయుచుండును. తనమాటను నిరాకరించి తాను కోరిన మొత్తములు చెల్లించనివారిపై నిందలు మోపబడి, శిక్షలపాలు కావింతురు. ఏ ఉద్యోగియైననూ, స్వతంత్ర బుద్ధిని కనపర్చినచో వెంటనే అతనిని ఉద్యోగము నుండి తొలగింతురు. ప్రజలను అణిచిపెట్టుటయందు సమర్థత గలిగి, ప్రభు ఆదరణ పొందినవాడైననూ, హఠాత్తుగా విరోధభావముచూపి శిక్షింపబడును. తనపై నేరములు మోపిన

సందర్భములయందు, తన తప్పిదములు కప్పిపుచ్చుకొను నిమిత్తము రాజులు ఈప్రకారం ఉద్యోగులను ఉద్యోగముల నుండి తొలగించుచుండుట కలదు. ఈ ప్రకారం తొలగింపబడినప్పుడు, తన కెట్టి సంబంధము లేనట్లు, తన ఏజెంటు చేసినట్లు ప్రభుత్వరాజకీయ శాఖ ప్రతినిధియైనను నటింతురు. ఇట్లుండియు; పెద్ద పెద్ద వుద్యోగములన్నియు రాజబంధువులకే పరిపాదింపబడుచున్నవి.

రసద్ - మగన్ - భేటి

క్రమపద్ధతిని, అక్రమపద్ధతిని చేయబడు ధనసంగ్రహ విషయము ప్రత్యేకముగా పేర్కొనదగును. నాటినిగూర్చిన వివరములు గతవ్యాసములో వివరింపబడినవి. ఆజాబితాకు మరి మూడు చేర్చవలసినవిగలవు. 'రసదు' అను పేర ప్రభువుగారుగాని, అతనివుద్యోగులుగాని దౌరాబయలు దేరుచో నాటికి కావలసిన బ్రాండి, సోడాబుడ్లతోసహా అన్నిరకముల భోజనసామాగ్రిలు సప్లయిచేయబడుచుండును. సప్లయిపరిమితి దౌరాచేయువాని హెూదా ననుసరించియుండును. రెండవది రాజుగారుకోరినప్పుడు ద్రవ్యరూపమును చెల్లించుదానిని 'మగన్' యందురు. పూర్వకాలమునందు కేవలము రాజుగారియింటజరుగు శుభాశుభకార్యములయందే ఈద్రవ్య సహాయపుపద్ధతి అమలునందుండెను. గాని నేడో, ప్రతి అవసరానవసర సమయములయందుకూడ ద్రవ్యముగుంజుట మితిమీరి, చివరకు రాజపుత్రుల విదేశచదువులకగు ఖర్చులు కూడ ప్రజలవద్ద వసూలుచేయబడుచున్నవి. ఇక మూడవ ధనాపహరణపద్ధతి ఏదనిన క్రొత్తసంవత్సరాదిరోజున 'భేటి'

యను పేర ప్రజలునుంచి ధనమునుతీసుకొనుట. పూర్వకాలమునందు రాజభక్తి చిహ్నముగా సంవత్సరాదిరోజున కొందరుపెద్దలు కొద్దిమొత్తములను యిచ్చెడివారు. ఇప్పుడో గ్రామోద్యోగులనుండి, ధనవంతులనుండి నిర్బంధముగా ఉద్యోగులచే నిర్ణయింపబడు పెద్దపెద్ద మొత్తములు వసూలు చేయబడుచున్నవి. గ్రామాధికారి తానుచెల్లించిన మొత్తములకు మించిన ధనమును భూమిపన్నువసూలుతోబాటు రైతులవద్ద ఈసంవత్సరాది వసూళ్లుకూడచేర్చి వసూలుచేయును. కొత్తనీటిసప్లయి సౌకర్యములేవియు చేయబడక పోయిననూ, కొన్నిసంస్థానములయందు భూమిపన్నులు విస్తారముగా పెంచబడినవి. రైతుస్థితి ఏమాత్రము విచారింపబడుటలేదు. కల్లుసారాయిల విషయమునను, అడవులసందర్భమునను యిదేపద్ధతి అవలంబింపబడుచున్నది. విపరీతముగా ధనము వసూలుచేయుదురు. ధనాపహరణమందు రైతుశక్తిని గాక రాజుగారి అవసరములు గమనింపబడుచున్నవి.

ఈకష్టములకంతకును మూలకారణము నిరంకుశవ్యక్తి పరిపాలనమైయున్నది. పరిపాలకులు, సామర్థ్యత, బలము, ప్రజాహితతత్పరత కలవారైనచో యింతచెడుగు కలిగెడిదికాదు. యిందుకువిరుద్ధముగా యిప్పటిరాజులలో చాలామంది అల్పబుద్ధిగలవారును, స్వార్థపరులును, అసమర్థులునునై యున్నారు. అట్టివారిక్రింద ఆరకపు ఉద్యోగులే పనిచేయుదురనుట చిత్రము కాదు. ఒకప్పుడు వారిలో సంస్కరించు తలంపుపుట్టి వివిధ మార్పునుచేయ మొదలిడిరి. గాని ఇంతలోబుద్ధిమారి యథాస్థితియుండే వదిలిరి. ఇట్టిపరిస్థితులతో రైతుల దుర్భరస్థితి

వర్ణింపనలవికాదు. ఏవ్యాపారమువృద్ధిపొందదు. వ్యవసాయ వృత్తి లాభదాయకమని తలంచినను వర్షములుకూడ రాజుల బుద్ధివలె వారికి ప్రతికూలించుచుండును. వెంటనే సంస్కరింపవలసిన ముఖ్యవిషయములు రెండుగలవు. రాజులు నిత్యకృత్య వ్యవహారములయందు జోక్యముకల్పించుకొనకుండ ఏర్పాటుచేయబడవలెను. సక్రమపద్ధతిని సంస్థాన ఆదాయములనుండి నియమితమొత్తము రాజుకుటుంబఖర్చులు నిమిత్తము వినియోగింపబడునట్లు నిర్ణయింపబడవలెను. రెండవది సక్రమపరిపాలనాపద్ధతినేర్పడి అర్హతగలవారు నియమింపబడి వారిచే పరిపాలనజరుగవలెను. ఈసక్రమపద్ధతి నడిపింపబడుటకు సార్వభౌమాధికారులు సంస్థానాధీశులకును, తమకునుగల న్యాయబద్ధ విధులతోబాటు తమకు ప్రజలయందుగల నైతిక బాధ్యతలను గమనించి పూనుకొనినచో, అసాధ్యమేమియు లేదు. వాస్తవమునకు సంస్థానాధీశులకు తామెంతబాధ్యులమని తలంచుచున్నారో బ్రిటిష్‌వారిపై సంస్థానప్రజలరక్షణ బాధ్యతకూడ కలదు. అటులగాక, సంస్థానాధీశులనే వెనుకవేసుకొని సమర్థింపచూచుట బ్రిటిష్‌వారి దురుద్దేశ్య ప్రేరితమని భారతప్రముఖులలోని కొందరినిశ్చితాభిప్రాయమునకు బలముచేకూర్చిన వారగుదురు.

ఈవ్యాసమునందు వివరించబడిన విషయములు సామదాయకమైనవి. అయితే అరోపణలన్నియు ప్రత్యేక నిదర్శనములతో కూడినవి. పలువురచే సత్యమని అంగీకరింపబడినవై, ఇందు వివరింపబడినవాటిలో అతిశయోక్తి కెంతమాత్రము లేవు. మరియు, అసందర్భములగు నిర్బంధములనుగూర్చి పూర్తిగా

వర్ణించుట మానితిమి. నిజమైన అభివృద్ధి ప్రజాజాగ్రితివలననే కలుగగలదు. ప్రజలు వారిహక్కులను గమనించవలెను. త్యాగబుద్ధితో హక్కులసాధించుటకు బూనవలెను.

### సంస్థానములయందు ఆందోళన చేయవలసినవారెవరు?

హిందీ పత్రికలలో ఈ విషయమునుగూర్చి చర్చింపబడుచున్నది. సంస్థానములయందు ప్రచారమొనర్చి ప్రబోధమొనర్చవలసినవారెవరను ప్రశ్నకు సంబంధించియుండెను. ప్రబోధము కాంగ్రెసువారు చేయవలెనా? అఖిలభారత సంస్థాన ప్రజామహాసభ వారా లేక స్థానిక రాజస్థాన ప్రజామండలివారలా? పై పేర్కొనబడిన ముగ్గురిలో మూడవవారు రెండవవారియొక్క అంతర్భాగమగుటచే, యిప్పుడు నిర్ణయించవలసినది కాంగ్రెసువారా లేక సంస్థానప్రజామహాసభ వారా యనునదైయున్నది. కాంగ్రెసును బయటి సంస్థయను సంకుచిత దృష్టి నేడమలునందున్నది. జూన్ ౧౯౩౫ కు పూర్వమీదృష్టియుండిన యుండవచ్చును. గాని సమాఖ్య నేర్పాటు చేయుటకు చట్టము కావింపబడినపిమ్మట, బ్రిటిష్ యిండియా వారును, సంస్థానములును సమాన భాగస్వాములైరి. ఉభయుల ప్రతినిధులను సమాన హోదాలో కేంద్ర శాసన సభలయందు సమావేశము కానున్నారు. ఒకరికొకరు సోదర, సుహృద్భావములతో కలిసిమెలసి తిరుగుట అవసరమగును. బ్రిటిష్ యిండియా ప్రతినిధులు, సంస్థానముల యందును, సంస్థానప్రతినిధులు బ్రిటిష్ యిండియాయందును సంచారములొనర్చి, శాసనములు సరిగా చేయగల్గుటకు అనుభవమును సంపాదించుట అవసరమగును. ఏ దృష్టితో చూచినను,

ఏప్రకారము ఆలోచించినను, కాంగ్రెసును బయటి సంస్థగా చూచుట సాధ్యపడదు. ఈ దృష్టితో ప్రస్తుత సమస్యలను గూర్చి యోచించి నిర్ణయించవలసియుండును.

కాంగ్రెసు; సంస్థానప్రజలు

సంస్థానప్రజలు తమ తమ సంస్థానములలో తమ తమ ప్రదేశములయందు కాంగ్రెసు కమిటీలను స్థాపించుకొను హక్కును కలిగియున్నారు. సంస్థానప్రజలు కాంగ్రెసు కమిటీల నేర్పర్చుకొను హక్కును నిషేధించు నిబంధనలు చేయు హక్కును ఏ రాష్ట్రకాంగ్రెసు కమిటీయును కలిగియుండ లేదు. ఈ సందర్భమున, ఏ కాంగ్రెసు సంఘ నియమావళి యందుగాని సందేహములు, లోపములు యున్నయెడల అందుకు సంబంధించిన సంస్థానప్రజ లెవ్వరైనను కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గంవారికి మనవిచేసుకొనవచ్చును. సంస్థాన ప్రజలతో సంబంధము కల్పించుకొని, వారి భవిష్యత్తును గూర్చిన నిర్ణయములయందు తోడ్పడుటకు కాంగ్రెసు అభిల షించుచున్నది. మరియు సంస్థానప్రజలయందలి శక్తిని రాజ కీయములయందు సక్రమమార్గముల నడపించుటకు కాంగ్రె సునకు హక్కు కలదు. వ్యక్తిస్వాతంత్రమున భంగకరముగా సంస్థానాధీశులు ప్రవర్తించినపట్ల శిక్షలనుభవించుటకు వెను దీయని ప్రచారకుల పనిని శ్రద్ధతో గమనించుచుండుటయే గాక తగు ప్రోత్సాహమివ్వగలము. కాంగ్రెసుసంస్థ, కాం గ్రెసు స్థాయిసంఘము, సంస్థానప్రజల స్వాతంత్ర్య పోరాట ములయందు, అండగా నిలిచి అవసరమైన సహాయమొనర్చు

టకు సిద్ధముగాయున్నది. సంస్థానప్రజల ప్రధాన హక్కుల కెట్టి భంగము వాటిల్లినను, పౌరస్వాతంత్ర్యహక్కుల సంఘము వారి తోడ్పాటు మీకు లభించును.

సంస్థాన ప్రజలు; ప్రజాపరిషత్తుసభలు

ఆదర్శములు, ఆచరణవిధానములగూర్చి కాంగ్రెసు తోడ్పడునుగాని, మీ సంస్థాన ఆంతరంగిక వ్యవహారములు, రాజకీయ సభలు మొదలగునవన్నియు ప్రజాపరిషత్తుద్వారా పని జరుగవలెను. సమాఖ్యశాసనసభకు ప్రతినిధుల పంపు హక్కు లభించినను అంతమాత్రముచే సంస్థానప్రజల పని పూర్తి కాజాలదు. సంస్థానములలో బాధ్యతాయుత ప్రభుత్వములు నెలకొల్పబడవలెను. ద్వివిధ ఆదర్శముల సాధించుటకు, ద్వివిధసంఘములుండుట అవసరమేయగును. మీ కష్టములు రెండింతలగునని మీరనవచ్చును. మీరు యిద్దరు యజమానుల సేవ చేయుచున్నారు. ఒకరు సంస్థానప్రభువు. రెండవవారు సార్వభౌమ ప్రభుత్వము. కాన మీకృషి ద్విగుణముకాక తప్పదు.

హిందూదేశము చీలికలుగా చేయబడినది

మిత్రులారా! విదేశప్రభువులు, స్వార్థముకొరకు భారతదేశమును చీలికలు కావించిరి. సంస్థానములని, రాష్ట్రములని రెండుగా విభజింపబడినది. సంస్థానములు విస్తీర్ణమునందు మూడవభాగమును, జనాభాయందు నాల్గవభాగము ఆక్రమించియున్నవి. మిగతా భారతదేశమునందలి రాష్ట్రములు, నిలువుగను, అడ్డముగను, చీల్చి, మహమ్మదీయులు, హిందువులు, క్రైస్తవులు, శిక్కులు, పార్సీలు, జమీం

దారులు, హరిజనులను వివిధతరగతులుగా విభజించి, ప్రతి సంఘమునకును ప్రత్యేక ఎన్నిక హక్కులు కల్పింపబడినవి. ఇంకనూ పట్టణములు, పల్లెలనియు, వ్యవసాయదారులు, కూలి వారనియు మరొక విభజన గలదు. సమభూములు, ఏజెన్సీ లన మరొక కోతకోసిరి. ఏజెన్సీకిక్రింద ౨ లక్షల మైళ్లు కలదు. జనాభా ౧౩౦ లక్షలు గలరు.

రాష్ట్రప్రభుత్వములని, సమాఖ్య కేంద్రప్రభుత్వమని మరొకవిభాగము కలదు. సమాఖ్య యింకనూ తెరవిడిరా లేదు. రాష్ట్రప్రభుత్వములు వివిధమినహాయింపులు, ముక్తా యింపులతో అమలుచేయబడినవి.

### సంస్థానములు భారతదేశాభివృద్ధి నిరోధకములు

కట్టెలుకూడ చెట్లలోనిభాగమేయని మరిచినట్లుసంస్థాన ములు, రాష్ట్రములుయను ఈవిభజనలమూలమున హిందూ దేశమంతా ఒకటను ఐకమత్యభావమును మనము మర తుమా? సృష్టియందే సంస్థానములు, రాష్ట్రప్రభుత్వములని భగవంతుడు విభజించి కొంతకాలము యీస్టుయిండియా కంపెనివారిని, వారితరువాత బ్రిటిష్‌వారిని మనపై అధికా రమువహించుటకు ఆభగవంతుడే నిర్ణయించెనని వూహించు స్థితిని నేడు మనమువచ్చితిమి. క్రమానుగతముగా తాత తండ్రు లనుంచివచ్చు సాంప్రదాయముల అనుసరించుటయు, పూర్వుల ఔన్నత్యమును గమనించి వుప్పొంగుటయు ప్రతిజాతికిని సహజలక్షణము. క్రమముగా ఒకసంతతికిని, మరొకసంతతికిని కలుగుచున్నమార్పులను గమనించదలచుచో పూర్వచరిత్రను గమనించుట అవసరము. ఒకానొక కాలమునందు హిమా

లయ శిఖరము సముద్రపు అడుగుభాగమునందుండుట ఎట్లు సంభవించెనో, భూభాగమును రెండుగాచీల్చి దక్షిణద్వీపములను భారతదేశమునుండి సముద్రమెటుల విభజించగలెనో తెలుసుకొనుటకు పూర్వకాలపుసంగతులను గ్రహించవలెను. మనకాలమునందో భూమిని త్రవ్వి పూర్వపురాజుల రాజమందిరములను, దేవాలయములను, బయటకుతీయుచున్నారు. ఇయ్యవి శతాబ్దములనుంచి భూగర్భమునందున్నవి. ఇవన్నియు మన పూర్వుల గొప్పతనమును చాటుచున్నవి. అటులనే మనకు నేడు కాన్పించుచున్న ఈచిన్నచిన్న సంస్థానములన్నియు ఒకొక్కకాలమునందు ఒకొక్కసంస్థానము ఒక వెలుగు వెలిగినవై, పెద్దభూభాగములను పరిపాలించినవైయున్నవి. అశోకుడు, సముద్రగుప్త, హర్షవర్ధనవంటి సామ్రాట్టులు ఈభరతఖండమును పాలించియుండిరి. ఆసామ్రాజ్యములకును నాటిసామ్రాజ్యములకును పోలికయేలేదు. గాని ఆరోజులలో చీలికలు; ప్రత్యేకరాజ్యములు లేవనికాదు. వున్నవి నదులు పుట్టినచోటునుండి సముద్రునిచేరువరకు, పాయలుపాయలుగా చీలుటయు, కొన్నిచోట్ల లంకలునేర్పడుటయు, ఒకచోట చాలవిశాలముగా ప్రవహించుటయు మరొకచోట సన్నగిలి లోతుతక్కువగా యుండుటయు ఈప్రకారం రూపాంతరములు పొందుచుంచుట మనము కాంచుచున్నాము. అటులనే పూర్వకాలములందుకూడ విభజింపబడుటయు, తిరిగికలయుటయు ఒకప్పుడు ఉన్నతస్థితి, మరొకప్పుడు పోరాటములు ఈప్రకారం హెచ్చుతగ్గులుగలవు. ప్రతిసంస్థానమును ఉన్నతమగు పూర్వచరిత్రను గల్గియున్నది. పురాతనచరిత్రపరిశోధకునికిని,

నూతన రాజకీయనేత్తకును కావలసినంతపనిని కల్పించజాలిన విషయములిందుగలవు.

బయటివారి జోక్యము.

రాష్ట్రములకు సంబంధించిన వ్యవహారములలో తాము తటస్థముగా నుందుమనియు, తమసంస్థాన వ్యవహారములలో బ్రిటిష్‌యిండియాప్రజలు జోక్యముకల్పించుకొన కూడదనియు సంస్థానాధీశులు వూహించుచున్నట్లు కనబడుచున్నది. ఈనటనలు సాకులనుగూర్చి యోచించవలసిన దేమియులేదు. రాష్ట్రములయందు జరుగుపోరాటములలో సంస్థానముల తటస్థభావము స్పెయిన్, అబిసీనియా పోరాటములయందు ఫ్రాన్సు, ఇంగ్లాండు, ఇటలీ,జర్మనిరాజ్యముల తటస్థభావమును పోలియుండును. జోక్యముండుననుట నిశ్చయము. రాష్ట్రముల యందు జరుగుచున్నపోరాటము భారతప్రజలకును, బ్రిటిష్ వారికిని సంబంధించినది. ఈపోరాటమునందు నిస్సహాయులు, నిరాయుధులునగు ప్రజలనెదుర్కొనుటకు బ్రిటిష్‌వారికి సంస్థానములు కోటలవంటివి. ఇంతియేకాదు సంస్థానములు బ్రిటిష్ వారికి ఆయుధాగారములవలెయుండి భారతీయుల నెదుర్కొనుటకు మనుష్యులను, ఆయుధములను సప్లయిచేయు కేంద్రములుగా పనిచేయును. ఈమాటలు నిరాధారములని తోచవచ్చును. దీర్ఘవిమర్శనాదృష్టితో భారత రాజకీయములను పరికించువారికి సత్యము గోచరించకపోదు. సంస్థానములు బ్రిటిష్‌వారి దయాదృష్టిపై నాధారపడియున్నవి. బ్రిటిష్‌వారు స్వతంత్రసంస్థానములుగా యింతవరకును నిల్వనిచ్చినది సంస్థానాధీశుల ధైర్యము, దేశభక్తి, త్యాగశక్తి కారణములని వూహించజాలని విషయములు. ఇందుకు విరుద్ధ

ముగా బ్రిటిష్‌వారి సానుభూతి సహాయమువలన నిల్వగలుగు చున్నవి. లేదీ సంస్థానాధీశులు చేయు ఆదరసత్కారములు, వారిప్రవర్తన గమనించి బ్రిటిష్‌వారూరకుండి యుండవచ్చును. మరొకవిధముగా చెప్పవలసివచ్చుచో సంస్థానాధీశులలొనర్చిన దేశద్రోహకార్యములకు లంచములుగా బ్రిటిష్‌వారిచే ఈసంస్థానములు ప్రసాదింపబడినవని చెప్పవచ్చును. పూర్వ చరిత్రను గమనించినవారెవరును సంస్థానాధీశులయందు ఆత్మ గౌరవముతోకూడిన విశాలభావములు కలుగునని విశ్వసించ జాలరు. ఎప్పుడైనను ఒకరిద్దరు సంస్థానాధీశులయందు అట్టి ఆత్మగౌరవ చిహ్నములు ఏమూలదాగియున్ననూ అట్టివారు బ్రిటిష్‌వారిచే పసిపట్టబడి, పదభ్రష్టులు కావింపబడకపోరు. సామ్రాజ్యలాభముల దృష్టియందుంచుకొని ప్రవర్తించినంత కాలము సంస్థానాధీశులు మంచివారుగా తలంపబడుదురు. మాతృదేశారాధన తత్పరులుగా పొడకట్టుచో, లాగివేయ బడుటో, లేక ఉద్యోగులమార్పో జరిగితీరును. సక్రమమార్గ మున నడుపుటకు ఆంగ్లేయోద్యోగి నియమింపబడును. ఈరోజున మాదృష్టిని ఆసంస్థానములవైపు సారించుచో, చిన్న పెద్దనయక అన్నిసంస్థానములలో కనీసము ఒక్కడైనను ఆంగ్లేయోద్యోగి సంస్థానవ్యవహారముల నడపుచున్నట్లు తెలుసుకొనగలరు. క్రమముగా ఈపద్ధతి అన్నిసంస్థానములయందును అమలుచేయబడుచూ సంస్థానములు హిందూదేశమునకు వేరుపుగురులైనవి. అభివృద్ధి సూచకవిధానములేవియు తల లెత్తజాలవు. రాజకీయమార్పులేవియు యుండవు. రాజకీయ నాయకులు, రాజకీయోద్యమములు పుట్టీపుట్టకమునుపే నిరో

ధింపబడును. బ్రిటిష్ యిండియాప్రజలను విదేశీయులకన్న హీనముగా సంస్థానములవారు జూతురు. సంస్థానప్రజలు తమ సంస్థానములయందు బానిసలకన్న హీనముగాచూడబడు చున్నారు. ప్రధానహక్కులనునవిలేనేలేవు. ప్రజాప్రాతినిధ్య సంస్థలు చెప్పుకొనదగినవేవియులేవు. బాధ్యతాయుత ప్రభుత్వమసలేలేదు. ప్రజలు అన్నిరకముల హింసలకు లోనగుచున్నారు. ఎట్టిచాకిరి సర్వేసర్వత్రాఅమలునందున్నది. ఊహామాత్రపు సరిహద్దులదాటి స్వాతంత్రభావములు తమసంస్థానములలో ప్రవేశించకూడదని సంస్థానాధీశులు కోరుదురు. వీరి కోరికలు వరదలు, భూకంపములు, తుఫానులు, కరువులు యితరరాజ్యములనుండి తమసరిహద్దులదాటి లోనికిరాకూడదను కోరికను పోలియున్నది.

రాష్ట్రముల సమస్యకన్న సంస్థానముల సమస్య గొప్ప చిక్కులతో కూడియున్నది. ఒక గర్విష్ఠుని ఆయుధముచేత గాని, మరే ఉపాయముచేతగాని మర్యాదగా తొలిగించ గలముగాని అతని బానిసత్వమును నెట్లు బాపగలము? భారత దేశపు ప్రస్తుత పరిస్థితులు చాల విషమించియున్నవి. విమర్శించుటకు బదులు జాలిచెందవలసిన స్థితియందు నేడు సంస్థానాధీశులున్నారు. సంస్థానాధీశులను పేరుకుమాత్రము రాజులుగా నుంచి, అధికార వ్యామోహముగల ఆ సంస్థానాధిపతులు రాజభక్తి చూపునట్లు బలవంతముచేయుచూ వారి అండన బ్రిటిష్ యిండియా ప్రజలను లొంగదీయుటకు బ్రిటిష్ వారు ప్రయత్నించుచున్నారు. సులభమార్గమున సౌఖ్యము లభించునను నాశ సంస్థానాధీశులకు, ప్రజలకు యుండుట ఆశ్చర్యము

కాదు. గాని కష్టములు పైవేసుకొని చిక్కులు విడదీయుట యనిన విసుగు పుట్టించునదిగా యుండునుగదా! అయినను పరిస్థితుల నెదుర్కొనవలసియుండును. మొదట సంస్థాన ప్రజలను గాఢనిద్రనుండి మేల్కొల్పవలెను. ప్రజలకు అజ్ఞానము, దానికితోడు అసహాయిత మిళితమైయున్నవి. వారికి వారి బలమునుగూర్చి హెచ్చరిక చేయుటవసరము. వారియందణిగియున్న శక్తులను బయటతీసి వారిమెదుట ప్రదర్శించవలెను.

ఈ రోజున 'ఝాభా'లో యువకులు కారాగార మందున్నారు. వారలు కారాగారమునందుంచటబడుకు గల కారణమేమి? సంస్థానాధీశుని విమర్శించిరనికాదు. తొలగింప బడిన సంస్థానాధీశుని తిర్గి సింహాసనమం దధిష్ఠింపజేసిన ప్రభుత్వ రాజకీయ శాఖవారిని మర్శించినందున శిక్ష ననుభ వించవలసినవారైరి. జోధపూరు సంస్థానమునందలి ముగ్గురు యువకులు నిర్బంధమందున్నారు. వారిప్పుడు నిరసనవ్రతము బూనియున్నారు. దాదాపు సంవత్సరమునుండి ఎట్టి విచార ణయు లేకుండగనే ముగ్గురు మూడుకోటలయందు మ్రగ్గు చున్నారు. ప్రజాసేవ చేయువారందరికి మొదట కల్గు ఫలితము లిట్టివే. బ్రిటిష్ఇండియా ప్రజలకు సంస్థానములు ౫౦ సంవత్సరములు వెనుకబడియున్నమాట వాస్తవమేగాని రాష్ట్ర ప్రజలు అన్ని అవాంతరములను, ఉడుదుడుకులనుదాటి నేడు సంస్థాన ప్రజలు సంవత్సరములకొలది ప్రయత్నించినను పొందజాలని అభివృద్ధిని పొందిరి. బ్రిటిష్ఇండియా ప్రజలతో బాటుతాము ను ముందుకు సాగదలచుచో బ్రిటిష్ఇండియా

ప్రజలను భవించిన కష్టములును చేసిన త్యాగమును సంస్థాన ప్రజలకూడ సహించుటకు తయారు కావలెను. త్యాగమొనర్చుటకు వెనుదీయనప్పుడే నిర్భయముగా తలయెత్తుకొని తిరుగ గల్గుదురు. లేనిచో శరీరములోని అరభాగము పక్షవాత వ్యాధిచే పడిపోయిన మిగతా అర్ధభాగమునకు భారము కల్పించునట్లు, భారతరాజకీయములయందు, మీరు భారముగా తలంపబడుటయేగాక, అభివృద్ధి అరికట్టబడి, మీ బ్రిటిష్ యిండియా సోదరులు ఒక్క అడుగైనను ముందిడకుండ అడ్డుపడినవారు కాగలరు.

మొదటిభాగము సంపూర్ణము.

---

3

# సంస్థాన సమస్యలు

## మొదటి ప్రకరణము

### ప్రజలలో చైతన్యము

గడచినతూరి నా తెలుగు నుపన్యాసమును మీరు వినియుంటిరి. న్యాయముగా విచారించిన, ఈ రోజు కన్నడ భాషలో ఉపన్యాసము జరుగవలసియుండును. నేను మైసూరు రాజ్యమును ఆంధ్రరాష్ట్రములో చేర్చు నుద్దేశ్యముతో నిచటకు వచ్చియుండలేదు. గాని, మైసూరు రాష్ట్రమందంతటను సంచారము చేసినతరువాత, ఈ రాష్ట్రవాసులందరు తెలుగు మాట్లాడువారని గ్రహించితిని. నేను వెళ్ళిన అన్ని ప్రదేశములయందును ప్రజలు, నన్ను తెలుగునందే నుపన్యసించ కోరిరి. పదివేలు సభికులుగల మైసూరు సభయందుకూడ తెలుగునందే నుపన్యసింపవలసినదని కోరబడితిని. పట్టణవాసులేమి, పల్లెవాసులేమి ప్రతివారును కన్పరిచిన ఉత్సాహము అపారము, వర్ణనాతీతము. కాంగ్రెసు అనినను, కాంగ్రెసు పలుకుబడియనినను యిష్టపడనివారు కొందరు, మైసూరు ప్రజలనుగూర్చి వింత కబుర్లు చెప్పుచుండిరి. ఈనాడు ప్రదర్శింపబడిన ఈ ఉత్సాహమున కంతయు, నా రాకయే కారణమనినే తలంచను. మహారాజావారుగాని, దివాన్‌గారుగాని,

లేక రెసిడెంటుగాని ఊరేగింపబడుచున్నప్పుడు అట్టి కల్పిత ఉత్సాహము ఉదయించిన ఉదయించవచ్చును. ఇయ్యది, సహజమై, స్వభావసిద్ధమై, ప్రజల నిరంతర ఆందోళనా ఫలితమేగాని మరొండు కాజాలదు. ఇట్టి ఉత్సాహమును నెవరును అరిగట్టజాలరు. దేశభక్తిచే ప్రేరేపింపబడిన ఉత్సాహము వెల్లువలై పారుచున్నది. జాతీయవికాసమునకు తొలుదొల్త కాన్పించు శుభ చిహ్నములలో ఉత్సాహము మొట్టమొదటిది. ప్రజలు పరిపాలనా భాధ్యతను వహించుటకు ఆతురత కలిగియున్నారనుటకు ఎంతటి త్యాగము, సాహసములనైనను ప్రదర్శించుటకు సంసిద్ధతను ప్రకటించ నున్నారనుటకు నిదర్శనములైయున్నవి. ఈ చిహ్నముల గ్రహించి వెంటనే సక్రమమార్గమున నడిపించుట అవసరము. ప్రభుత్వోద్యోగులు ఈ విషయమును గ్రహించకపోలేదు. తుఫాను వీచుచున్నదని వారికి తెలియును. అయితే ప్రభుత్వోద్యోగులలో కొందరు, తాటాకు గొడుగులు నుపయోగించిన చాలుననుకొనుచున్నారు. ఈ తుఫాను కూకటివేళ్లతోకూడ పెగిలించివేయునని వారికి తెలియకపోలేదు. ముసలమ్మ కథవలె అట్లాంటిక్ సముద్రపు నీరును తీసివేయ ప్రయత్నమును బోలియున్నది. కెన్యూట్ రాజువలె, లేచుచున్న అలలను ఆపచూచుచున్నారు. మానవుడు, తన అల్పబుద్ధిచే, అసాధ్యములను సాధించచూచును. కానిచో, మా సంచారమునందు గావించిన ప్రభుత్వోద్యోగీయుల అవకతవక పనుల నేమనవలెను?

సంస్థానోద్యోగుల ప్రవర్తన

మేము కోలారునందు అడుగుపెట్టిన మొదటిరోజే శ్రీయుత చెంగలాయ రెడ్డిగారి పేర నీలిరంగు కాగితపు శ్రీముఖ మొకటి అందచేయబడెను. ఆతడు తీవ్రముగా ప్రవర్తించు చున్నాడనియు, తీవ్రతతగ్గించుకొనవలసినదనియు స్నేహపూర్వకసలహా ఆనోటీసుయందు తెలుపబడియుండెను. ఆజిల్లా బోర్డు అధ్యక్షులైనందుకు శ్రీయుత చెంగలాయ రెడ్డిగారికి ఆమాత్రము మర్యాదగా అచ్చట హెచ్చరింపబడెను. అట నుండి మేముదొడ్డబల్లిపూర్ గ్రామము వెళ్లితిమి. దాదాపు ౭ లేక ౮ వేల జనాభాగల చిన్న గ్రామము. అయితే అచ్చట సాయంకాలము ౬ గంటలనుంచి రాత్రి ౧౦ గంటలవరకు దాదాపు ౧౦ వేలజనము మారాకకు ఎదురుచూచుచుండిరి. జాతీయపతాకమును ప్రతిష్ఠించకూడదని ఆపట్టణాధికారి ఉత్తరువును మాపైజారీచేసెను. ఒకజాతీయపతాకమును ప్రతిష్ఠించుటకు పట్టణాధికారి నిషేధాజ్ఞను ప్రకటించ, సభకువచ్చిన వేలకొలది బాలురు, స్త్రీలు తమతమ భుజములపై చిన్నచిన్న జాతీయజండాలను ప్రతిష్ఠించిరి. చటల్ దుర్గమునందు మరొకఉత్తర్వు జారీచేయబడెను. మైసూరు సంస్థాన రాజకీయములనుగూర్చి మాట్లాడకూడదని ఆనిషేధాజ్ఞయందుకలదు. మైసూరు, బెంగుళూరు నగరములయందు అపాయకరముగా పరిగణింపబడని సంస్థానరాజకీయ పరిస్థితులనుగూర్చిన మాఉపన్యాసములు చటల్ దుర్గమునందెట్లు అపాయకరములగునో మాకుతోచలేదు. బహిరంగసమావేశము జరుపుకొనుటకు 'అనుమతి' పత్రము పొందవలసియుండుననిి

తెల్పిరి. ప్రజలు, 'సంస్థానములు-సమాఖ్య' యను విషయముపై మమ్ములను ఉపన్యసింపకోరిరి. గాని ప్రభుత్వోద్యోగులచే అనుజ్ఞ నిరాకరింపబడెను. దానివలన మేమచట 'ఖద్దరు' ను గూర్చి మాట్లాడవలసివచ్చెను. 'ఖద్దరు' ను గూర్చిగాని, లేక సంస్థానములు - సమాఖ్యనుగూర్చిగాని మాట్లాడుటకు మాకేమియభ్యంతరము? అన్నిబాటలు ఢిల్లీకే చేరును. అన్ని ఉపన్యాసములు స్వరాజ్యమునుగూర్చియే యుండును. మన రాజ్యమును ఖద్దరువలన పోగొట్టుకొంటిమి. తిర్గి ఖద్దరుద్వారానే స్వరాజ్యమును సంపాదించవలసియున్నది. దేవనగరి యందుకూడ 'మైసూరుసంస్థాన రాజ్యాంగముల' ను గూర్చి ఉపన్యసించకూడదని నిషేధించిరి. ప్రజలు, 'సంస్థానప్రజల హక్కుల' ను గూర్చి ఉపన్యసించకోరిరి. మేజస్ట్రేటుగారికి ఈవిషయముపై నుపన్యసించనిచ్చుట కంగీకారము కాకపోయెను. కాంగ్రెసు అభివృద్ధినిగూర్చి మాట్లాడవలసినదని ప్రజలుకోరిరి. ఇయ్యదికూడ ఆప్రభుత్వోద్యోగికి అంగీకారము కాదాయెను. చివరకు మామూలు "ఖద్దరు; గ్రామపరిశ్రమలు" గూర్చి మాట్లాడుటకు నిశ్చయింపబడెను. నేను గడిచినసభలో నుడివినట్లు భారతజాతీయత పరిశ్రమలపై నాధారపడియున్నది. పరిశ్రమలకెల్ల ఖద్దరు మకుటమువంటిది. హరిహరగ్రామము అదేజిల్లాలో చేరినగ్రామము. తమ అవస్థలను తెల్పుచూ దేవనగరివాసులు హరిహర్ గ్రామవాసులకు తంతీమూలముగా హెచ్చరికచేసిరి. ఒకరాజ్యములో దోపిడిగావించి మరొకరాజ్యమునందు తలదాచుకొను దోపిడిగాండ్లవలె మేముఇచ్చట మైసూరుసరిహద్దులదాటి బొంబాయి

రాజధానిలో ప్రవేశించితిమి. రెండురాజ్యముల విభజించు చిహ్నములేమి యుండగలవు? హిందూపురం, గౌరిబిందనూరు లమధ్య కొయ్యదూలమొకటి మాత్రముండెను. పెద్దపెద్దకొండలు, గుట్టలు యుండుననుకొంటిని. రెండురాజ్యములమధ్య సరిహద్దులవద్ద, గనులు, అడవులుండును కాబోలుననుకొంటిని. గాని తెలుపురంగువేసిన ఒకకొయ్యదూలమే యుండెను. అక్కడనుండు కాపలావానిచేతనొక శుభ్రముంచినంత ఆదూలముకూడ నాతడు తొలగించెను. ఈరాజ్యమును ఆరాజ్యము నుండి వేరుచేయునదొక సన్నని రేఖామాత్రమే. ఒకనిలువుగీత-రేఖాగణితమెరిగిన మీకు-రేఖాగణితము ప్రకారం గీతయనిన వెడల్పులేని పొడుగాటిదానిని గీతయందురని చెప్పబడెను. ఇంతమాత్రముననే మైసూరు బయిటిప్రపంచమునుండి వేరుగా యున్నట్లు తలంచవచ్చునా! సముద్రమధ్యమందున్న ద్వీపమా ఏమి? ఏదైన అవాంతరము తటస్థించుచో సముద్రమధ్యమందున్నలంకకుకూడ రాకతప్పదు. పరిక్షితునిగతి ఏమాయె? సముద్రమధ్యమందు నివసించి శాపమునుండి తప్పించుకొనదలంచెను. గాన ప్రతివారును శాపములుతగలకుండ రక్షించుకొనవలెనుగాని తగిలినశాపములనుండికాదు. మైసూరురాజ్యము కోరతగినది ప్రత్యేకముగా నివసించుటకాదు. ప్లేగు వ్యాధులొచ్చినప్పుడైనను పదిరోజులకుమించి క్వారంటైను విధించరు. ప్రజాదరణపొందుట ముఖ్యము. ఆఖరు శ్రీముఖము మాకు కంకణహల్లిగ్రామమందు అందచేయబడెను. బాధ్యతాయుతపరిపాలన యొక్క ఆధిపత్యముక్రింద ఎట్టిబహిరంగ సభలు జరుపకూడదని ఆనోటీసునందు తెలుపబడెను. బాధ్య

తాయుత పరిపాలనయొక్క ఆధిపత్యముక్రింద యననేమో మాకుబోధపడలేదు. ఆజ్ఞోల్లంఘన గావించకనే ఆవిషయముపై మేము ఉపన్యసించగలిగి యుంటిమి. గడిబిడలు, గంద్రగోళములు చేయనుద్దేశ్యము మాకులేదు. ఏదో! ప్రాణములతో బయటపడితిమి. ఎట్టిఅవాంతరములు లేకుండనే యిండ్లకు కూడ చేరుదుమను ఆశగలదు. మైసూరురాజ్యమునందు సంచారముచేయు నుద్దేశ్యముతో మేము మాసంచారకార్యక్రమము ప్రకటించినప్పుడు చాలామంది చాలాసందేహములను వెలిబుచ్చిరి. సంస్థానపరిస్థితులనుగూర్చి భయంకరమైనట్టియు, విచారకరమైనట్టియు విమర్శనలు గావించబడెను. మేముకొచ్చిన్, తిరువాన్కూరు సంస్థానమునకు వెళ్లియుంటిమి. మేము తిరువాన్కూరునందు చాలాప్రదేశములను చూచితిమి. రాజ్యము నాలుగుమూలలుచుట్టితిమి. ఆరెండు సంస్థానములయందును రెండుమహాసభలయందు అధ్యక్షత వహించియుంటిని.

### కొచ్చిన్ రాజవంశము

ప్రస్తుత కొచ్చిన్ మహారాజునుగూర్చి తీవ్రవిమర్శన గావించితిని. ఆతడు ౭౫ సంవత్సరములవృద్ధు. దేవాలయప్రవేశమును అంగీకరించనందున ఆవిషయమునుగూర్చి తెల్పుచూ, నవయువకుడగు తిరువాన్కూరురాజుతో పండుబారినవృద్ధుని పోటిపెట్టుట సబబుగాలేదనియు, అందువలన కొచ్చిన్ మహారాజు దేవాలయప్రవేశమున కంగీకరించనందుకు క్షమింపవలసి యుండుననియు నేనంటిని. ప్రస్తుతప్రభువు తదనంతరము సింహాసన మధిష్ఠించదగినవారసులలో యువకు

డొక్కైన గలదేమోయని వారివంశము నంతయు గాలించి తిమి. ఆవంశమునకు చెందినవారు షుమారు ౧౫౦ మంది గలరు. అందులో ౧౩ మంది ౬౦ సంవత్సరముల వయస్సు దాటినవారు. మొదటి నల్గురికి ౭౦ సంవత్సరములు దాటెను. నలుబదవవాడుమాత్రము ౩౪ సంవత్సరముల వయస్సుగల వాడుగాయుండెను. గానయువకుడా సింహాసనాధిపత్యమునకు వచ్చునను నాశలేదు. యువకసంఘములవారు ఈవిషయ మును గమనింతురుగాక! తదనంతరహక్కుగల ఈముసలి వారసులందరికిని రెండింతలుగా ఉపకారవేతనములిచ్చి తమ హక్కులువదలి విరమించకోరుట మంచిపద్ధతియని మేము సలహాయిచ్చితిమి.



# రెండవ ప్రకరణము

## శాసనసభలు

భారతదేశము మొత్తముపై, నిజమాలోచించిన మైసూరు, కొచ్చిన్, తిరువాన్కూరు సంస్థానములు నాగరకత యందు అగ్రస్థానము వహించియున్నవని ఎల్లరంగీకరించ వలసియుండును. ఈ మూడు సంస్థానములును ఒకే పోకడలు కలవు. అభివృద్ధియందు ఒకదానిని మరొకటి మించవలెనను తలంపుతో పోటాపోటీలు పడుచున్నట్లున్నవి. ౫౭ గురు సభ్యులతో కూడిన శాసనసభ యొకటి కొచ్చిన్ నందు కలదు. వారిలో ౩౭ గురు ఎన్నికసభ్యులుగలరు. సంఖ్యాబలము ఎన్నికసభ్యులకే గలదు. ఈ విషయమునందు కొచ్చిన్ సంస్థానము మైసూరును వెనుకపడవేసినది. ఆతడు మన మనుకొనుచున్నంతగా, వెనుకపడియుండుటలేదు. ఈ రెండు సంస్థానముల (కొచ్చిన్, మైసూరు) కన్న తిరువాన్కూరు సంస్థాన యువరాజు చాలా అభివృద్ధి మార్గమందున్నాడు. ఆతడు సింహాసన మధిష్ఠించుట, రెండవశాసనసభా నేర్పాటు ఒకేసారి జరిగెను. ఆపైసభ క్రిందిసభకు విషయసూచికగా యుండును. పై సభ క్రిందిసభవారి ఉదుదుడుకు పనులను సరికట్టి, విమర్శించి, నిర్ణయములు గావించును. గాన అచట రెండవ సభ యుండుట అవసరమాయెను. కొచ్చిన్ శాసన సభయందువలె, తిరువాన్కూరునందలి క్రిందిశాసనసభకు ఎన్నికసభ్యులు అధికసంఖ్య కలిగియున్నారు. మొత్తం ౭౨

సభ్యులలో ౪౯ మంది ఎన్నుకొనబడినవారు. ౧౩ అనధికార నియమిత సభ్యులు, ౧౦ మంది అధికారసభ్యులుందురు. మైసూరునందు, మీకొక శాసనసభ కలదు. శాసనసభ యందలి ప్రతినిధులు, శాసనములు చేయుటయందు అధికార ముగలవారుకారు. అయ్యది పండితపరిషత్తును బోలియున్నది. వివాహ సదస్యముతోకూడ పోల్పవచ్చును. అధికారము నందున్న ప్రభువుల నాశీర్వదించు హక్కునుమాత్రమే కలిగి యున్నారు. బ్రాహ్మణులు వివాహవేళలందు వధూవరుల నాశీర్వదింతురు. సంభావన చాలినంత యివ్వనిచో, చాలధని తగాదా చేయుదురు. అట్లే, ఈ శాసనసభా సభ్యులకు మొర పెట్టుకొను హక్కు మాత్రము పూర్తిగా కలదు. లేక రాజా శ్రితుల కూటమనవచ్చును. గాన ప్రణాళికనుండి రద్దుచేయుటయే మంచిది. మీ శాసనసభయందు ఎన్నికసభ్యుల సంఖ్య చాలినంతగాలేదు. ౫౩ మందిలో ౨౧ మంది మాత్రమే ఎన్నికసభ్యులున్నారు. ౨౦ మంది నియమిత సభ్యులు గలరు. ౫ గురు అధికారసభ్యులున్నారు. గాన మీరు కొచ్చిన్, తిరువాన్కూరులకంటె చాల వెనుకబడియున్నారు. నేడు అమలు నందున్న రాజ్యాంగమును గూర్చి వివరించుచుంటినేగాని మరేమియులేదు. మీకు ఉద్రేకము కలిగించుటకును, ఆందోళనచేయ పురిగొల్పు నుద్దేశ్యముతోను చెప్పుటలేదు. మీ పరిస్థితులను, మీ యిరుగుపొరుగు సంస్థాన పరిస్థితులతో పోల్చితిని. ఈ మూడు సంస్థానములందును, బాధ్యతాయుత పరిపాలనా స్థాపనకు పరిస్థితులు అనుకూలముగా యున్నవి.

ప్ర జా ం దో ళ న

ప్రస్తుతపరిస్థితులను గమనించినను, క్రమాభివృద్ధిని సూచించు చరిత్రాంశములబట్టి యోచించినను, బాధ్యతా యుత పరిపాలనావిధానము వెంటనే అమలుపర్చుటకు వాతావరణ మనుకూలముగా యున్నదని తెలుసుకొనకపోరు. గాన వెంటనే బాధ్యతాయుత పరిపాలనావిధాన మమలు పర్చుటయే ముఖ్యకర్తవ్యము. ప్రజలు కోరకమునునే ప్రజా ప్రాతినిధ్య సంస్థల నెలకొల్పిన గౌరవము మైసూరు ప్రభు త్వము పొందియుండెను. అయాచితముగా ప్రసాదించిన హక్కుల విషయము గర్వింపదగినదైయుండ, ప్రజలు మరి కొన్ని హక్కులను యాచించుచున్నప్పుడు వెంటనే ప్రసా దించుట ఎంతయో గర్వించవలసిన విషయము కాగలదు. కుమారుడు కోరనిదే మిఠాయీలను కొనిపెట్టు తండ్రి యుండునా? అటుల కొనిపెట్టువాడే యగుచో, ఆకలిగొని అన్నముకొరకై ఏడ్చు కుమారునికి అన్నము పెట్టకుండ గలడా? అధికారము నిర్వహించిన పెద్దలు, రాజకీయ వేత్తలు, ఈ సంస్థానమునందు బాధ్యతాయుత పరిపాలనా విధానము నెలకొల్పుట అవసర కర్తవ్యమని సూచించి యుండిరి. మైసూరునందు ౧౯౨౨-౨౩ సంవత్సరములలో జరిగిన అల్లరుల సందర్భమున సర్. యం. విశ్వేశ్వరయ్య గారి అధ్యక్షతక్రింద నొక విచారణ సంఘము నేర్పర్చబడి యుండెను. ఆతడు, తన నివేదికయందు, వెంటనే బాధ్యతా యుత పరిపాలనను స్థాపించుటయే, అన్ని అశాంతులు శాం తించుటకు పరిహారము కాగలదని సూచించెను. సర్. యం.

విశ్వేశ్వరయ్యగారు నిప్పులు గ్రక్కు సహాయ నిరాకరణ వాది కాడుగదా; కాంగ్రెసువాదికూడ కాడే!! మొత్తము నకు మైసూరు రాజ్యమునకు చెందినవాడుకదా! మీరు బాధ్యతాయుత పరిపాలనను కోరుటయందు అసహజమేమియు లేదు. నాగరకతాభివృద్ధి పొందిన ఈరోజులలోకూడ ప్రజా ప్రభుత్వములకు వ్యతిరేకముగా యుండుట ఉపయోగకరమైన పద్ధతి కాదు. ఇప్పుడు మూడురకముల ప్రభుత్వ విధానములు ప్రపంచమునం దమలులోనున్నవి. ఇంగ్లాండు, ఫ్రాన్సుదేశ ములయందలి ప్రభుత్వములవంటి, భాధ్యతతోకూడిన కార్య నిర్వాహకవర్గముగల ప్రజాప్రభుత్వ పద్ధతిని వ్యవహరించు రాజ్యములు కొన్ని గలవు. మరికొన్ని రాజ్యములయందు ఫాసిస్టు పద్ధతిని పరిపాలన జరుగుచున్నవి. ఇక మిగిలిన కొన్ని రాజ్యములందు, ప్రజా సంస్థలను తొలగించి సోవియట్ విధాన మవలంబించి పాటకపు జనులచే అధికారము నడుప బడుచున్నది. మైసూరు రాజ్యమందలి బాధ్యతగల రాజకీయ వేత్త లెవరును చివరి పద్ధతికి అంగీకరింపడనుట నిశ్చయము. గాన యింగ్లాండుదేశమునందున్న ప్రజాప్రభుత్వవిధానమునో- ప్రజాప్రభుత్వ విధానము అపజయము గాంచినదని తలం చుచో,—ఫాసిస్టువిధానమునో, లేక సోవియట్ విధానమునో చేపట్టవలసియుండును. మైసూరుప్రభుత్వము ఫాసిస్టువిధానము వంకకు మ్రొగ్గుచో, ప్రజలు సోవియట్ విధానము వంకకు మరలుదురు. ఈ అతివాద పద్ధతులను వదిలి, తెలివిగల రాజకీయవేత్తలందరు, మధ్య మార్గమగు ప్రజాప్రభుత్వ

విధానమును చేబట్టుట తెలివిగలపని. ప్రస్తుత మైసూరు పరిస్థితుల గమనింపుడు.

కార్యనిర్వాహక వర్గము.

విద్యావంతుడు, నవనాగరికుడునగు భారతీయుడు మీకు ప్రధానమంత్రిగా యున్నాడు. వీరుచాలకాలము మహారాజావారి అంతరంగిక కార్యదర్శిగాయుండెను. ఆతడా స్థానము వదలగనే, ఆస్థానమునందు ఆంగ్లేయుడు నియమించ పడెను. ఆ ఆంగ్లేయుడు మదాసుప్రభుత్వ సివిలియన్ శాఖకు చెంది, ఉద్యోగమునుండి విరమించినవాడు. గత ౧౧ సంవత్సరములనుంచిమీవద్దయున్నాడు. విద్యుచ్ఛాఖాధికారి ఆంగ్లేయుడు. మీస్థానికపరిపాలనా శాఖాధికారి, బెంగళూరునందు గడచినసారి అల్లరులు జరిగినప్పటినుండి, రక్షణశాఖాధికారి, రైల్వేఏజెంటు- వీరందరు ఆంగ్లేయులే. మైసూరు, బెంగుళూరునందలి పెద్దకళాశాలా ప్రధానోధ్యాయు లిద్దరును ఆంగ్లేయులే. మెడికల్ కాలేజి (వైద్యకళాశాల) ప్రధానోపాధ్యాయుడు, వీరేగాక ప్రధానన్యాయస్థానాధికారి, సైన్యాధికారి- వీరందరును ఆంగ్లేయులే. న్యాయమూర్తి రీలేగారు సంపూర్ణస్వాతంత్ర్యము పొందుహక్కు మైసూరుప్రజలకు ఎన్నటికిని కలుగదని నిర్ధారణగాచెప్పివేసెను. నూతనవిధానములేవి అమలుచేయవలసివచ్చినను, న్యాయమూర్తుల సలహాలను తీసుకొనిన రాజకీయవేత్త ఒక్కడునులేడు.

ఉదాహరణములు

మొదటి చార్లెసురాజు వురితీయబడినప్పుడు, ఎనిమిదవ ఎడ్వర్డురాజు పదభ్రష్టుని గావించినప్పుడు ఏన్యాయధీశుని

సలహాగైకొనబడెను? అన్నివిషయములయందును మనకు ఇంగ్లాండే ఆదర్శముకదా! మనమహారాజులకు యింగ్లాండు రాజుకన్న ఆదర్శపాత్రులెవరుండును. వారికి (ఇంగ్లాడురాజుకు) వీరు (సంస్థానాధీశులు) సామంతులైయున్నారు. ముఖస్తుతులకు ప్రత్యామ్నాయమే అనుకరణము. ఇంగ్లాండుదేశపు రాజు చట్టబద్ధమైన ప్రభువు. మరియు ఇంగ్లాడురాజ్యమునందు రాజే ప్రధానపురుషుడు (సభాపతి). ఎనిమిదవ ఎడ్వర్డు ప్రభువు యువరాజుగాయున్నప్పుడు, సామ్రాజ్యమందంతటను మంచిపలుకుబడిని సంపాదించియుండెను. ఆతడు, తనఇంగ్లాడు దేశపు వ్యాపారాభివృద్ధికై తన పలుకుబడిని వినియోగించుచుండెను. ఆతడు బ్రేజిల్ పట్టణమునకు వెళ్లినప్పుడు అచ్చటి రైల్వేకంపెనీవారికి కావలసిన విద్యుచ్ఛక్తియంత్రములకై 30 లక్షల మిలయన్‌ల కంట్రాక్టును ఒక ఇంగ్లీషుకంపెనీ వారికి యిప్పించినట్లు సగర్వముగా చెప్పుకొనియుండెను. ఇట్టివాడు బ్రిటిష్‌సింహాసన మధిష్ఠించెను. ఇతడు బ్రహ్మచారి. ఒకరోజున బ్రిటిష్‌పరిధానియగు బాల్డ్విన్ ప్రభువున్నూ, కాంటర్‌బరిప్రధానమతాచార్యులగు ఆర్చిబిషప్ గారున్నూ, రాజును సందర్శించ వెళ్లిరి. మెల్లగా పట్టాభిషేకమునకు సంబంధించిన ప్రసంగము లేవతీసిరి. ఈక్రిందిసంభాషణజరిగెను:—

ప్రధానమంత్రి:- పట్టాభిషేకము విషయ మేమందురు.

రాజు:- సంతసమే. సంసిద్ధుడను.

ప్రధానమంత్రి:- మహారాణిగారి మాటయేమి?

రాజు:- వివాహఖర్చులనిమిత్తం అలవెన్సు మంజూరి చేయవలసినదని యింతకుమున్నే కోరియుంటినిగదా!

ప్రిధానమంత్రి:- ఎవరిని పెండ్లాడుదురు?

రాజు:- నేను ప్రేమించినకన్యను.

ప్రధానమంత్రి:- వీలుకాదు.

రాజు:- మీరు ప్రేమించినకన్యలను మీరు వివాహమాడు చుండుటలేదా?

ప్రధానమంత్రి:- మేము ప్రేమించినకన్యలనే మేమువివాహ మాడుచున్నాము.

రాజు:- అయినచో మీవలె, నేనేల వివాహమాడకూడదు?

ప్రిధానమంత్రి:- వీలులేదు. నేను ఈదేశపురాజునుకాను కదా!

రాజు:- మీమాటవినను. నేవరించినకన్యనే వివాహమాడు దును.

ప్రధానమంత్రి: - తమకు, తాముప్రేమించినకన్య, ఇంగ్లాండు రాజ్యము-రెండులభించవు. వీనిలో ఒకదానిని వరించుడు.

రాజు:- నేను, ప్రేమించినకన్యనే వరింతును. రాజ్యమువలదు.

ప్రిధానమంత్రి:- రాజ్యము వదలుకొన్నట్లు వ్రాసియిమ్ము.

రాజు ఈక్రిందివిధముగా వెంటనే వ్రాసియిచ్చెను:—

"ఎనిమిదవ ఎడ్వర్డురాజునైననేను, నాచేవరింపబడిన కన్యను వివాహమాడుటకు అంగీకరించనందుననూ, ప్రిధాన మంత్రిచే నిర్ణయింపబడుకన్యను నేను వివాహమాడ నిచ్ఛ గించుటలేనందువలనను, నేను నారాజ్యధికారపదవిని వదలు

కొనుచున్నాను. ఇకముందు నేను నావారసులు, ఎవరిని ఎట్టి తగాదాచేయము. ఇదిసమ్మతినివ్రాసియిచ్చిన ఖరారునామా''.

చూచితిరా! ఇంగ్లాండురాజుగారి స్థితియేయిట్లున్నది. ఒక మోటారులో కూర్చొనబెట్టి రాజుగారిని అదేరాత్రిసాగ నంపిరి. తెల్లవారుసరికి రాజు ఇంగ్లాండువదిలి వందలకొలది మైళ్లు దాటిపోయెను. ఎనిమిదవ ఎడ్వర్డురాజు, విండ్సరుప్రభువు గామారును. తదుపరి వివాహముచేసుకొనెను. వివాహము జరిపించిన పురోహితుడు తనవుద్యోగమునకు తిలోదకమిడ వలసివచ్చెను. అతనివివాహమునందు పాల్గొనుటకు అతని సోదరులు అనుమతింపబడలేదు. ఇంగ్లాడుదేశపురాజు, సభా పతి (అనగా పెద్దమనిషి) మార్గదర్శకుడు-గతి యిట్లున్నది. సంఘములో నూతనపంథా త్రొక్కెను. ఈతడు ఈమార్గము నకు ఆదర్శపురుషుడు. ఇతడు ఇక స్వేచ్ఛగా తనకొత్తపుంత లను నడిపింపగలడు. తనదేశపు వ్యాపారాభివృద్ధికి ఎంతేని ప్రయత్నించవచ్చును. పరిశ్రమల ప్రోత్సహించవచ్చును. అతని కిప్పుడు సివిల్, క్రిమినల్ న్యాయశాసనముల గొడవలేదు. కామన్సుసభను గూర్చినట్టిగాని, ప్రభువులసభకు సంబంధించి నట్టిగాని చింత అసలేలేదు. తానుమాట్లాడవలసిన దానిని యింతకుముందు ప్రధానమంత్రియే వ్రాసియిచ్చెడివాడు.

### ఒక వింతకథ

అయిదవజార్జినిగూర్చి ఒకవింత కథకలదు. ౧౯౨౧-౨౨ సంవత్సరములయందు ఇంగ్లాండు - ఐర్లాండులమధ్య పోట్లాటలు చెలరేగుచుండెను. ౧౯౨౧ జనవరినుంచి ౧౯౨౨ నవంబరు వరకు బెల్ఫాస్టునగర వీధులందు హెూరా

హెూరాహోరీ పోరాడుచుండిరి. ఐరిషు దేశభక్తులను రాత్రి ౧ గంట వేళయందు వారియిండ్లలో ప్రవేశించి, తలుపులుతట్టి, యింటి లోనివారిని లేపి, యింటిలోనివారు తలుపు తెరువగనే, యింటి వాని భార్యాపిల్లలు యిల్లువదిలి వెళ్లుటకు ౧-౨ నిమిషము వ్యవధినిచ్చి, ౧-౨ ని. ముగియగనే ఆయింటివానిని తుపాకి తో కాల్చిచంపి ఆయింటిని తగలపెట్టుచుండిరి. ఈఘోరములు ౧౦ నెలలకాలము ఎడతెరిపిలేకుండ జరిగెను. ఐరిషువిప్లవ కారులుమాత్రము తక్కువచేసిరా? బదులుకుబదులు తీర్చు చుండిరి. బెల్‌ఫాస్టు నగరవీధులు రక్తమయములాయెను. చివరకు ౧౯౨౨ నవంబరు మాసమునందు తిరుగుబాటు నాయకుడగు 'డివెలరా' ను 'లాయడుజార్జి' పిలిపించెను. తిరుగుబాటునాయకునితో సలహాపడుటకు సిద్ధపడిన ప్రధాన మంత్రిపై కన్సర్వేటివ్ పక్షము ఆగ్రహావేశ పరవశులైరి. తిరుగుబాటు నాయకునితోగాక ఎవరితో సమాధానపడవలసి యుండునని లాయడుజార్జియనెను. ఈకథయంతయు పంచమ జార్జి చక్రవర్తిగారి కోరికపైజరిగెను. సార్వభౌముని ఉపన్యా సము మొదటలాయడుజార్జిగారిచే తయారుకాబడెను. ప్రధాన మంత్రి యుపన్యాసము తనకు నిరంకుశముగా కాన్పించినందున, రుచించలేదనియు, ఉపన్యాసము తయారుచేయవద్దనియు చక్రవర్తి ప్రధానికి తెలియజేసెను. ఆ ఉపన్యాసము నిలుప బడుటయు, వెనువెంటనే ఐరిషు ప్రజాస్వాతంత్ర్య ప్రక

టనయు జరిగియుండెను. గాన మహారాజులుగాని, రాజులు గాని, సంస్థానాధిశులుగాని, మరెవరైనగానిందు అధికార ములు ప్రజాయత్తములు గావించుచో గౌరవింపబడుదురు. లేక అంటిపెట్టుకొని కూర్చొనగోరుచో, ఆపదవులు తమను వదిలిపోవును.

---

# మూడవ ప్రకరణము

## ఇంకెన్నాళ్లు?

యితర సంస్థానములకన్న తక్కువ అధికారములుగల మైసూరు రాజుగారికి బాధ్యతాయుత పరిపాలనను ప్రసాదించు వాక్కు అసలున్నదా లేదాయని కొందరికి సందేహము కలదు. అన్ని సంస్థానముల సంధిపత్రిములలోను ఒక సాధారణ నియమము కలదు. ఆనియమముప్రికారం గవర్నర్ జనరల్ అనుమతి పొందనిదే పరిపాలనావిధానములం దెట్టి మార్పులను చేయకూడదు. నేచెప్పినట్లు సాధారణనియమమే యగుచో దాటవచ్చును. లేక ప్రత్యేక నియమమేయగుచో, ఆ నియమము సంధిపత్రమునుండి తొలగించబడుటకైఆందోళనము చేయవలసియుండును. ఎద్విధముగా చూచినను మహారాజుగారు బాధ్యతాయుతప్రభుత్వమును ప్రజలకు ప్రిసాదించుటయే ఉత్తమపద్ధతి. అయితే వారు మనోనిశ్చయము చేసుకొనవలెను. అయితే వారెప్పుడు మన కోరికలు నీడేర్చ సిద్ధపడుదురు? ప్రిజలు తయారైనచో ప్రిభువుకూడ తయారగును. మీరు తయారుగాకుండ, ఊరక ఊడిపడునను నాశతో కూర్చొనవచ్చునదికాదు. కాంగ్రెసు విధానము చేపట్టి, సంఘమును కట్టుబాట్లతో నడుపుచూ, ఎంతటి త్యాగమునకైనను వెనుదీయనప్పుడే మీకోరికలు నెరవేరగలవు. గాన పట్టుదలతో సక్రిమాందోళన చేయవలెను. స్వాతంత్ర్యమనునది కోటీశ్వరులచే కొనతగిన వస్తువుకాదు. వారొకవేళ కొన

గల్గినను అయ్యది కోటీశ్వరులదగును. దుర్మార్గులు, రౌడీలు దోచితెచ్చు వస్తువుకాదు. ఒకవేళ తేగల్గినను అయ్యది వారి పరమగును. గాన ప్రజలే సంస్థానాధీశునినుంచి సాధించవలెను. యుద్ధభూమియందు జార్జిరాజుతో పోరాడి ప్రజలు స్వాతంత్ర్యమును సంపాదించగల్గిరి. అయితే బాధ్యతాయుత ప్రభుత్వము పొందుటకు ముందు మనము పాటించవలసిన నియమములు కొన్ని గలవు. ఒకటి ఐకమత్యత పెంపొందవలెను. ప్రత్యేక సంఘములు తమలో తాము ఐకమత్యత కొరకై ప్రయత్నించిన చాలదు. అన్ని సంఘములు ఐక్యకంఠముతో తమ హక్కులను కోరవలెను. ఈ విషయమునందు కొచ్చిన్, తిరువాన్కూరు రాజ్యములకన్న మైసూరు ముందంజ వేసినది.

మతము వేరుపురుగువంటిది.

జాతీయతకు, మతము వేరుపురుగువంటిది. మైసూరు ప్రజలు మతకలహముల స్థితిని దాటిరి. కొచ్చిన్, తిరువాన్కూరు సంస్థానములందలి ప్రజలు మతద్వేషమును పోగొట్టుకొనుటకై విశ్వప్రయత్నములు గావించుచున్నారు. తిరువాన్కూరు జనాభా ౫౧౻ లక్షలు. అందు ౧౬ లక్షలు క్రైస్తవులు. 3౻ లక్షలు హరిజనులు, ౮ లక్షలు ఈడిగవారు. వీరందరు అస్పృస్యులేగాక గ్రామబాహ్యులు. ఈ మూడు వర్గములవారు ఏకీభవించి అధికసంఖ్యాకులైరి. వీరి మొత్తము జనసంఖ్య ౨౭౻ లక్షల మందియైరి. ప్రతివిషయము మతదృష్టితో చూడబడుచున్నది. చిన్న ఉద్యోగముగానిండు, పెద్దదిగానిండు ఏశాఖకు చెందినవాని కాయుద్యోగము

లంభించెను—మహమ్మదీయునకా, ఈడిగవానికా లేక మరెవ్వనికనితర్కించుకొనుచుందురు. అంతమాత్రముచే అచట మతద్వేషము తీవ్రముగా యున్నదని తలచకుడు. క్రైస్తవులలో పలుశాఖలు కలవు. కొచ్చిన్, తిరువాన్కూరు సంస్థానముల రెంటియందును మొత్తం ౧౬ అంతఃశాఖలుగలవు. రోమన్ క్యాథలిక్కులు, ప్రెస్బటరేనియన్లు, అమెరికన్ బాప్టిస్టులు, మార్థమేట్ క్రైస్తవులు, లాటిన్ క్రైస్తవులు, అంటోచ్ దేవాలయమునకు చెందిన క్రైస్తవులు, సైమేరియన్ క్రైస్తవులు మొదలుగాగల పలుశాఖలుగలవు. ఏ ఉద్యోగమునకైనను ఒకనిని నియమించవలసినప్పుడు, ప్రతి సంఘమువారును, తమ తమ సంఘీయులు ఎంతమంది ఎన్ని ఉద్యోగములలో యున్నారను వివాదము బయలుదేరుచుండును. వారి రాజకీయములంతయు ఉద్యోగపంపకములకు సంబంధించియున్నవి. పలవులు చిలవలుగా విభజింపబడి, చివరకు ఈ సాంఘిక పోరాటము అంత్యదశకు వచ్చినది. ఇప్పుడు దృష్టి విశాలాశయముల వైపుకు సారింపబడినది. ఇకముందు రాబోవు మార్పు తిరువాన్కూరునందు బాధ్యతాయుత పరిపాలనావిధానము అమలునకు వచ్చుటయే. మతపాక్షికబుద్ధి యింకను పూర్తిగా పోలేదు. ఈసమస్యయే ప్రభుత్వమును చీకాకుపర్చుచున్నది. ప్రతి సంఘమును ఈ లోపమును బాగుగా గ్రహించిరి. ప్రజలుకూడ ఈ కళంకమును పోగొట్టుకొన ప్రయత్నించుచున్నారు. అదృష్టవశమున మైసూరు ప్రజలు ఈ మార్పులన్నియు దాటిరి. ౧౯౩౦ సంవత్సరమునరకు మైసూరు రాజకీయములు ప్రజామిత్రసంఘము

వారిచే నిర్వహించబడుచుండెను. ఆసంఘమునకు విశాలాశయములు లేవన వీలులేదు. కాని, మతపాక్షిక దృష్టి మాత్రముండెను. ఈ సంఘము జస్టిసుపార్టీలో నుంచి పుట్టిన పిలకను బోలియుండెను. దానితరువాత ప్రజాసంఘమనుపేర నూతన సంఘమొకటి కార్యరంగమున ప్రవేశించెను. ఆ సంఘము బాధ్యతాయుత పరిపాలనతోబాటు, మతవిషయములయందు కూడ జోక్యము కలిగించుకొనుచు పనిచేయుచుండెను. క్రమ మార్పులో యియ్యది అభివృద్ధిసూచకమని ప్రతివారును స్పష్టముగా గ్రహించగల్గుదురు. త్వరలోనే పై రెండు సంఘములను ఒకటిగా మారెను. తమ ఉభయుల మధ్య గల భేదములు, మూడవవర్గమునకు స్థానమిచ్చుచున్నపని గ్రహించిరి. గడిచిన జనవరియందు శాసనసభకు అభ్యర్థుల నిల్పిరి. ఎన్నికలలో అధికస్థానముల బడిసి విజయము గాంచిరి. ఎన్నికలకు నిలిచిన కాంగ్రెసుసంఘమువారు జయము గాంచజాలకపోయిరి. ౧౬ అక్టోబరువరకు ఈ పద్ధతి సాగెను. ఆ శుభదినమున మూడు సంఘములవారును ఏకీభవించిరి. అందుచే నేడు మైనూరునందు ఒక సంస్థానకాంగ్రెసు సంఘము మాత్రమే పనిచేయుచున్నది. ఏ ఇతర సంఘముకూడ జాతీయసంఘముకాక కుక్కగొడుగు పార్టీలైయున్నవి. నిన్నటి దినము 'ముస్లింహాలు'నందు "డాక్టరు పట్టాభి, మెహతా గార్లకు జబాబు" యిచ్చు నిమిత్తము ఒక సమావేశము జరుపబడెను. దాదాపు ౨౦ మంది మిత్రులు సమావేశమునందుండిరి. ఈ బ్రహ్మాండమైన, అసంఖ్యాకుల సమావేశము చూడుడు, ఆ సభను చూడుడు. ఈ సభయందు ౨౦౦౦౦

మందికి తక్కువ యుండరు. ఆ సమావేశకులు ప్రభుత్వము వారికి నిజపరిస్థితులను తెల్పుచున్నట్లున్న తోచును. విరిగిన దూలముగల యింటిలో గాక, గట్టి దూలములతో ప్రమాదము లేని యింటియందుమాత్రమే నివసించకోరుదురు. ఇయ్యది అందరెరింగిన సామాన్య విషయమే. గాని, నిన్న మొన్న పుట్టిన కాంగ్రెసు, ఎంతైనను, నూతన సంఘమే. కాంగ్రెసు ఆదర్శములను చేపట్టెను. క్రొత్తగా పుట్టిన సంఘమగుట దానిని నిరుత్సాహపరచకూడదు. ప్రతి అనుభవజ్ఞుడు నూతన పురుషుని, తక్కువయని తలంచుట సహజము. అయితే ఆరంభదశ దాటకుండ నెవ్వరును అనుభవజ్ఞులు కాజాలరుకదా!

## మనకర్తవ్యము

మిగతా రెండుసంఘములను కాంగ్రెసునందు లీనమగుట కంగీకరించినందుకు వారినభినందించ వలసియున్నది. ఇప్పుడు మనము ఏకగ్రీవముగా ఐక్యకంఠముతో మనకోరికలను తెలుపగలము. ౫ వ మార్చి తేదీన జరుగనున్న ఎన్నికలసందర్భమున మనబలమును ఋజువుచేయగల్గుదుమనుట గర్వింపదగినవిషయము. అటుల ఋజువుచేయ గల్గినప్పుడు ప్రజలకోరిక న్యాయమైనదికాదని ఏధీరుడు నిబ్బరముతో చెప్పగలడు? ఈ విషయమునే మరొకదృష్టితోకూడ పరికించవచ్చును. అయ్యది చరిత్రాధారములకు సంబంధించినవిమర్శ. ఈసంస్థానపరిపాలనా విధానమందు మార్పు ౧౮౮౧ సంవత్సరమునందు ప్రారంభమాయెను. ౧౮౮౧ సంవత్సరమునందు మీకు ప్రజాప్రతినిధిసభ ప్రసాదింపబడెను. అయ్యది

ఆనాటిప్రజల ఆందోళనాఫలితమై యున్నది. కాంగ్రెసు యువ కులీవిషయము యింకనూ తెలుసుకొనియుండలేదు.

ఆకాలమునందు శ్రీరంగాచార్యులవారు మంత్రిగా పనిచేయుచుండిరి. ఈప్రజాప్రతినిధిసభను ప్రసాదించినది మంత్రియగు రంగాచారిగారనుటకన్న, సర్ కార్డ్ యనుట సత్యము వచించినట్లగును. ఆతడు మహారాజుగారికి విద్యా బోధకుడుగా యుండెను. ప్రజాందోళన శాంతింపచేయుటకు, ప్రజాప్రతినిధిసభను నెలకొల్పుటయే సరియైనప్రతిక్రియయని మహారాజాగారికి సలహాయిచ్చెను. ఆసలహాపైననే స్థానిక స్వపరిపాలనాసంస్థలను నవివెలసెను. ఆకాలమునందు లార్డు రిప్పన్ వైస్రాయిగా పనిచేయుచుండెను. స్థానికస్వపరిపాలనా సంస్థలు భారతస్వపరిపాలనయను విషయములు అంతకు ముందునుంచియే గాలిలోతేలి యాడుచుండెను. ఆగాలి సంస్థానములకుకూడ సోకెను. కోరికలు సరిహద్దులదాటకుండ నాపజాలిన వారెవ్వరునులేరు. మీా సంస్థానము బ్రిటిష్ యిండియాకు సంబంధించిన ౯ జిల్లాలనడుమయున్నది. అరవజిల్లాలగు ఉత్తరఆర్కాటు, సేలం, కోయంబత్తూరు జిల్లాలున్నూ, మలబారుకు చెందినఉత్తరకనరా, దక్షిణకనరా, ధార్వారుజిల్లాలున్నూ తెలుగుజిల్లాలగు అనంతపురం, కడప, చిత్తూరుజిల్లాలున్నూ గలవు. మీారీతొమ్మిది జిల్లాలమధ్య బంధించబడియున్నారు. మీారాజ్యపు అత్యధికపు పొడుగు ౨౦౦ మైళ్లున్నూ, వెడల్పు ౮౦ మైళ్లున్నూగలదు. మీారా జ్యపుమధ్యనుంచి బ్రిటిష్ యిండియాకు వెళ్లదలచుచో, ఆవై పున ౧౦౦ మైళ్లు, ఈవైపున ౪౦ మైళ్లు వెళ్లినచాలును

ప్రజలు ఎల్లప్పుడు వచ్చిపోవుచుందురు. మీమామధ్య యిచ్చిపుచ్చుకోళ్లుకలవు. బ్రిటిష్‌యిండియా, బెంగుళూరులమధ్య వ్యాపారసంబంధముకలదు. మీరు మాబియ్యమును తిందురు. మేము మీఆలుగడ్డలకొందుము. గాన మీరు ప్రత్యేకించి లేరు. మీకు ప్రత్యేకమునందు నభిలాషయేయున్నచో, మీదసరా మహోత్సవములకు, మాబ్రిటిష్ యిండియా పెద్దలకు ఆహ్వానములేల పంపుచుందురు? మీరు మీప్రవర్తనను చక్కబరచుకొనకుండ, చీటికిమాటికి మమ్ములబయటివారమని యనకుడు. మిమ్ముల ప్రస్తుతస్థితిలో విడువజాలము. మనల నొకటిగా సమాఖ్య బంధించివైచినది. గాన మాభావములు ఈ సరిహద్దులదాటి మీహృదయాంతరాళమునందు స్థానమేర్పర్చుకొనుచున్నవి. బ్రిటిష్‌యిండియాయందు స్థానిక సంస్థలు ఏర్పర్చబడినప్పుడే మీరు శాసనసభను పొందితిరి. గాన ఇప్పుడు మీరభివృద్ధిమార్గమునందొక అడుగుముందు కిడుడు.



# నాల్గవ ప్రకరణము



## సింహావలోకనము.

---

గడచినసభలో, మాకు మొదటిసారి ౧౯౦౯ సంవత్సరమునందు మింటో-మార్లే సంస్కరణములు ప్రవేశపెట్టబడెనని నేను చెప్పియుంటిని. 3 సంవత్సరములుముందే మీకు శాసనసభవచ్చెను. ౧౯౨౦ సంవత్సరమునందు మాంటాగు-ఛెల్మ్సుఫర్డు సంస్కరణములు వచ్చెను. మీరో! ౧౯౨౩ సంవత్సరములో పొందితిరి. ఈప్రకారం సంస్కరణములు మద్రాసునుంచి మైసూరుచేరుటకు 3 సంవత్సరములుపట్టెను. మాకు చివరసారి ౧౯౩౫ సంవత్సరమునందు నూతనసంస్కరణలు ప్రసాదింపబడి, ౧౯౩౭ సంవత్సరమున అమలుకు వచ్చెను. మద్రాసురాజధానివారు నూతనసంస్కరణములు పొందగల్గిరేయను తొందరయే మీఆందోళనకు, అశాంతికి కారణములు. గాన మీరు మీపొరుగువారగు మద్రాసురాజధాని ప్రజలతో అన్నిరకముల సంబంధము కలిగినవారైతిరి. ఏదో పైపైపుట్టిన ఆందోళనయనిగాని, లేక బయటివారి ప్రేరణయనిగాని ఈసభను చూచినవారెవరనగలరు?

మీవ్యవహారములయందు శ్రద్ధతీసుకొనుచున్నందుకు ఎవరైన కాంగ్రెసును తప్పుపట్టగలరా? మీవ్యవహారముల గూర్చి మాట్లాడుచుంటిననిన, సంస్థానములగూర్చి మాట్లాడుచుంటినని నాభావము. మీరు సరియగు శ్రద్ధతీసుకొనుట

లేదని మీపై నిందమోపుచున్నాను. మీరందరు కాంగ్రెసు సందు పాల్గొనియున్నచో, మాకు అభేద్యమగు బలము చేకూరియుండెడిది. మీరామహాసంస్థనుగూర్చి యోచించక పోవుటయేగాక లక్ష్యపెట్టనైనలేదు. మీరింతవరకును వైతొలగియుంటిరి. మీరు, మీమహారాజులను, మంత్రులను, వారి ఆడంబరములను, చూచి పొంగిపోవుచుంటిరి. ప్రాతకాలపు ఆడంబరములు మిమ్ములను వ్యామోహపర్చుచున్నవి. మమ్ముల వదిలితిరి. మహాత్మాగాంధిగారిచే తయారుచేయబడిన నియమావళి ప్రకారము ౧౯౨౦ సంవత్సరమునందే మీరు కాంగ్రెసుమహాసభకు సభ్యులుగాచేరు హక్కుగలిగియుంటిరని మహాత్మాగారు మీకు కాంగ్రెసుతీర్మానములను చదివి వినిపించిరికదా! ఇక యోచించుడు. మనము సంపాదించిన సంస్కరణలు, కాంగ్రెసు ఎప్పుడెప్పుడేవిధముగా మార్పులుపొందుచూవచ్చినది, వాటితోబాటుసంస్థానములందే మార్పులుకలిగినది గమనింపుడు. ౧౯౧౯ లో మాకు ఛెల్మ్సుఫర్డు సంస్కరణచట్టము లభించెను. ౧౯౨౦ సంవత్సరములో సైమన్ కమిటి ప్రకటింపబడెను. సహజపద్ధతిని సంస్థానములగూర్చిన యోచనలు కాంగ్రెసుదృష్టి నాకర్షింపజొచ్చెను. ౧౯౨౭ సంవత్సరపు మద్రాసుకాంగ్రెసు సమావేశములో సంస్థానములయందు ప్రజాప్రతినిధిసంస్థల నెలకొల్పి బాధ్యతాయుత స్వపరిపాలన విధానమములు పర్చవలసినదిగా సంస్థానాధీశులనుకోరుచూ, నొకతీర్మానముగావించబడియుండెను. ౧౯౨౮ సంవత్సరపు సర్వపక్ష సమావేశమునందు కాంగ్రెసు మామూలపాటగాయుండిన, "సంస్థానముల ఆంతరంగిక వ్యవహారములయందు

కాంగ్రెసుజోక్యము పుచ్చుకొనజాలదు." అను భాగము వదిలి వేయబడెను. మీామైసూర్ప్రతినిధులు కలకత్తా కాంగ్రెసు సమావేశమునకుహాజరైరె, యీమార్పుకొరకు పట్టుబట్టిరి. ౧౯౩౫ సం॥ లో తిరిగి యీసమస్య పైకివచ్చెను. వరుసగా శ్వేతపత్రిము, జాయింటుకమిటీరిపోర్టు, యిండియాసంస్కరణ శాసనము-ఈప్రికారం ఒకటివెంటనొకటి అమలుకువచ్చుటచే ఆరోజులలో కాంగ్రెసుకు తీరుబడిలేకుండెను. ఈమార్పులు తీవ్రివిమర్శనలకు గురియయ్యెను. చివరకు కాంగ్రెసునందు కలతలకుకూడ దారితీసెను.

మహాత్ముని శపథము

౧౯౩౪ సంవత్సరమునందు, గాంధీమహాత్ముడు కాంగ్రెసును వదలివెళ్లుటకుగల మూడుకారణములలో సంస్థానసమస్య యొకటిగాయుండెను. మహాత్ముడు కాంగ్రెసునుండి విరమించెను. అప్పటినుండి సంస్థానప్రిజలు కాంగ్రెసును వెంటాడి, వెంటాడి, చివరకు కాంగ్రెసు సంస్థానవ్యవహారములయందు పూర్తిబాధ్యత వహించునట్లుచేసిరి. ఈరోజుకాంగ్రెసు సంస్థాన వ్యవహారములలో జోక్యముకలిగించుకొనుచున్నదనిన సంస్థాన ప్రిజల కృషియేకారణము, వేరుకాదు. గాన మైసూరు ప్రజలు కాంగ్రెసుపద్ధతినే ననుసరించదలచుచో, ఆప్రిణాళికనే, ఆ విధానమునే చేపట్టవలసియుండును. కాంగ్రెస్సనిన... కాదు. పైపూతమెరుంగులుకావు. అయ్యది కట్టుకథయు కాదు. కాంగ్రెసు మైసూర్ప్రజల హృదయాంతరాళములయందు ప్రవేశించి స్థానమేర్పర్చుకొని స్థిరపడినది. ఈమధ్య సర్. కే. శేషాద్రి అయ్యర్ గారు ఒకగ్రంథములో "ప్రజాప్రితినిధి

సంస్థలతోకూడిన బాధ్యతాయుత పరిపాలనా విధానము మైసూరునం దేర్పడవలెనని, జాతీయసంస్థ నొకటి నెలకొల్ప బడుట అవసరమ". ని వ్రాసినట్లు చదివియుంటిని. సమర్థుడు ప్రజ్ఞావంతుడు, దూరదృష్టితోకూడిన రాజకీయదురంధరుడునగు వాని యింతటి మంచిసలహాయిచ్చినందుకు మనమతని బహి రంగముగా కొనియాడవలసియుండును. ఈరోజున అట్టిజాతీయ సంస్థ మైసూరునందు నెలకొల్పబడినది. భారతదేశమున ఏకైక జాతీయసంస్థ కాంగ్రెసుగలదు. గాన మీరు నియమబద్ధదృ ష్టితోచూచినను, చారిత్రికదృష్టితోచూచినను లేక ప్రస్తుత పరిస్థితుల ననుసరించిచూచినను, లేక మరేదృష్టితో పరికించి నను బాధ్యతాయుత పరిపాలనావిధానమును వెంటనే అమలు పర్చుట కనీసధర్మమని తెలియగలదు. ప్రజాందోళన చుల కనగాచూచిన చూడవచ్చును. ధనవంతుడు తనదివ్యమందిర మందు నివసించుచూ, పూరిగుడిసెలు, మట్టికొంపలలో నివ సించు బీదవానినిగూర్చి, ఆతని దుర్భరదారిద్ర్యమునుగూర్చి తలచకపోవచ్చును. ఉన్నతోద్యోగమందున్న రాజకీయవేత్త తనచే నియమింపబడు తనక్రింది ఉద్యోగుల మాటలపై నాధార పడక, నిజపరిస్థితుల తెలుసుకొనదలంచుచో, వీధులవెంటనడ చుచూ, స్వయముగా కళ్లుపెట్టుకొని చూడవలెను.

### వెనుకకు మళ్లకుడు

మీరు మా వెంటనుండి నడిచిరానిచో ఈ ప్రయా ణము జయప్రదముకాదు. ఒక కుటుంబము ఒక గ్రామము నుంచి మరొక గ్రామము వెళ్ళుచున్నదనుకొనుడు. తండ్రి ముందు పోవుచుండును. తల్లి వెనుకబడియుండును. ఆ ఉభ

యులపిల్ల చాలా వెనుకబడియున్నది. అయితే తండ్రి ముందు పరుగిడుచుండ, పిల్ల వెనుకబడియుండ, ఉభయుల వెనుక యున్న పిల్లకొరకును, ముందురుకుచున్న భర్తకొరకును తటా పటాయించుచుండు తల్లిని, పిల్లను, ఎటుల ముందు గ్రామమున కాతండ్రి చేర్చగలుగును? అటులనే సంస్థానములు, రాష్ట్రములు ఒకటివెంట నొకటి కలిసి నడువవలెను. రాష్ట్రములు సంస్థానములను వెనుకవేసి ముందుకు పోజాలవు. రాజకీయ జీవనమునందు యిరుపక్షములను చూడవలెను. హరిహరు లిద్దరుకలరు. ఒకరికొకరికి హెచ్చుతగ్గులు లేవు. ఒకరు రెండవవానికి శక్తియందుగాని, అధికారమునందుగాని తీసిపోరు. మీరు మాతో కలిసి హరిహరులవలె యుండ వలెనుగాని పక్షవాత వ్యాధిచే పడిపోయిన అంగమువలె యుండకూడదు. నాకుడిచెయ్యి, కుడికాలు ఆరోగ్యముగా యున్నంతమాత్రమున పరుగెత్తగల్గుదునా? శరీరములో చెడిన భాగము, మిగతా భాగమునకు భారముగా యుండునుకదా! తాము (సంస్థానప్రజలు) విస్తీర్ణమునందు ౩ వ భాగమును, జనాభాయందు ౪ వ వంతును ఆక్రమించియున్నారు. మీరు మమ్ముల పట్టుకొని వెనుకకు లాగుచో మేము ముందుకు సాగిపోగల్గునదెట్లు? మీతో సమాఖ్యయందు చేతులు కలిపి పనిచేయునదెట్లు? తల్లియు, బిడ్డయు, తండ్రివద్దకు చేరనైన వలెను, లేదా తల్లి బిడ్డవచ్చువరకైనను తండ్రి ఆగవలసి యుండును. ఉభయులు నడచుచునే యున్నచో, ఒకరి నొకరు కలుసుకొనజాలరు. గాన వడిగా నడువగల్గిన తండ్రి ఆగవలసియుండునుకదా! ఈ ఉద్దేశ్యముతోనే సమాఖ్య

నౌకదానిని ఇంగ్లీషువారు కల్పించిరి. బ్రిటిష్‌వారు రాష్ట్రములపై తమ అధికారమును కోల్పోయిరి. వ్యాపారమూ సన్నగిలినది. గౌరవప్రపత్తులు అంతర్ధానమైనవి. తట్టబుట్టలు నెత్తిన వేసుకొని త్వరలో తర్లవలసిన స్థితివచ్చినదని వారు గ్రహించగల్గిరి. వెళ్ళకుడు, మాతోబాటు యిచ్చటనే, మాపై అధికారులుగా గాక, మాతోబాటు స్నేహితులుగా నుండుడంటిమి. గాని వారా సరిహద్దులదాటి సంస్థానముల యందు ప్రవేశించి యిచ్చట తమ అధికారమును బలపర్చుకొన జూచుచున్నారు. హైద్రాబాదునందు ౬ గురు ఆంగ్లేయులు ప్రభుత్వోద్యోగములయందున్నారు. భరతపూరు ఆంగ్లేయోద్యోగుల వశమందేయున్నది. నాభారాజ్యము ఆంగ్లేయుని ఏజెన్సీక్రింద పరిపాలనక్రిందజరుగుచున్నది. ఇందూరు రాజ్యమును నాభాతోబాటు చెప్పవలసినదే. పాటియాలా సంస్థానమునందు పనిచేయువారంద రాంగ్లేయులే. ఆళ్వారు, జోధపూరు సంస్థానప్రధానమంత్రులు ఆంగ్లేయులే. జునాగేడు సంస్థానములో ఆంగ్లేయుడున్నాడు. ౪౦ సంస్థానములు నేడు ఆంగ్లేయ అధికారులచే నిర్వహింపబడుచున్నవి. ఆంగ్లేయులు, సంస్థానములను గుఱ్ఱములపై నెక్కి బ్రిటిష్‌యిండియా ప్రజలపై తుపాకులను గురిపెట్టిరా? యన్నట్లున్నది.

మీ భవిష్యత్తు—కర్తవ్యము.

మీరు త్వరలో బాధ్యతాయుత పరిపాలన సాధించజాలనిచో, బ్రిటిష్‌వారు కోటలో ప్రవేశించి, టిప్పుసుల్తానును జయించి, శ్రీరంగపటం కోటను స్వాధీనపర్చుకొని నందు ప్రవేశించిన సమయమునందు కోటలోనున్న ధైర్యహీనులగు

సైనికులను బోలియుందురు. మీరు హిందు దేశపు వేరుపురుగు లనబడుదురు. మరియు బ్రిటిష్ వ్యాపారమునకు, పరిపాలనాధి కారమునకు అవకాశము కల్పించినవారగుదురు. స్వరాజ్యము మనలకు స్వస్తి చెప్పిపోవును. మీ మీ స్నేహముల త్రెంచి వేసి, మిమ్ములను దిక్కులజేయు నుద్దేశము మాకు లేదు. కాంగ్రెసు కార్యక్రమమంతయు సత్యము; అహింసలపై నాధారపడియున్నది. మేము వెళ్ళిన అన్నిచోట్లయందును అహింసా సిద్ధాంతమునే బోధించితిమి. ఎట్టి ఉద్రేకము కలిగించు పరిస్థితులందైననూ, సహనము కలిగియుండవలెనని బోధించితిమి. ఉద్యోగస్తులను వ్యక్తిపరముగా విమర్శించ కూడదనియు, నిందాగర్భిత వాక్యములతో తూలనాడకూడ దనియు చెప్పితిమి. రాజ్యాంగ చక్రమునందు వారు పనిముట్ల వలె నున్నారు. వారు నిస్సహాయులు. పరిపాలనాసంస్థను సంస్కరించుటయందే మీ సర్వశక్తుల పనిచేయవలెను. బ్రిటిష్ యిండియాయందలి ప్రభుత్వోద్యోగులు చెప్పనలవి గానంత రాజద్రోహపరులైయున్నారు. అయినను వారి సాను భూతినికూడ సంపాదించ ప్రయత్నించవలెను. మనము కసి తీర్చుకొనవలెనను తలంపులు మాని, క్షమాబుద్ధిని మనలో పెంపొందించుకొనవలెను. త్రికరణశుద్ధిగా అహింస నవలంబింప వలెను. బ్రిటిష్ యిండియాయందు జయప్రదముగా పనిచేసిన విధానము మీకేల నుపయోగపడదు? తదితర మార్గము లన్నియు కార్యకారి కానప్పుడు, అస్వతంత్రజాతికి సత్యా గ్రహ మొక్కటియే శరణ్యము. అన్నిటికన్న ఉత్తమమైనది. ఎట్టి సవాలునకైననూ సరియైన జబాబు కాగలదు. సత్యా

గ్రహీ అపజయమనున దెరుంగడు. జయాపజయంబులు అత నికి సమానంబులు. ప్రతి అపజయము జయమనుసౌధము నకు సోపానములు. అపజయములు భూమియందు దాగి యుండిన బునాదులవంటివి. ఇంతకుముందు మీకృషిచే సాధించగల్గినట్లే, ముందుకూడ కృషిచేయుచు సాధించి తీరుదురు. మీసంస్థానము చాలాఅభివృద్ధిని పొందియుండెను. నిన్నటి ముస్లింసభయందు ఒకమిత్రుడు తన ఉపన్యాసమధ్య మందు సర్. కె. శేషాద్రి అయ్యర్ గారు ఈనగరమునందు విద్యుచ్ఛక్తి నేర్పాటుచేసి స్విట్జర్లాండువలె శోభావంతమొన ర్చెనని శ్లాఘించియుండెను. భద్రావతియను పరిశ్రమను స్థాపించి సర్. యం. విశ్వేశ్వరయ్యగారు తమసంస్థానమును బర్మింగుహాముగా జేసెను. సర్. కాంతరాజ్ ఉర్సుగారు పట్టు పరిశ్రమను నెలగొల్పి జపానువలెచేసెను. చక్కెరపరిశ్ర మను నెలకొల్పి సర్. యిస్మాయిల్ గారు జావాద్వీపమువలె చేసెను. నేను సర్. యిస్మాయిల్ గారికి మరొక గొప్పగౌరవ మును సంపాదించగల్గు విషయమును సూచింతును. ఇచ్చట బాధ్యతాయుత పరిపాలనను నెలగొల్పి, ఇంగ్లాండురాజ్యము నకు తుల్యముగానొనర్చుగాకయని సవినయముగా కోరు చున్నాను.



కొండా శంకరయ్యగారి ప్రీమియర్ ముద్రాక్షరశాల, శికిందాబాదు.

# ప్ర శం స

—:—

మద్రాసునుండి శ్రీ. తాపీధర్మారావుగారి సంపాదకత్వమున వెలువడు 'కాగడా' అను పత్రిక యిట్లభిప్రాయ మిచ్చుచున్నది:—

"దేశభక్తితోనిండి, విజ్ఞానాన్ని వెదజల్లుచూ ఉన్న ఈ ప్రచురణములు (౭వ ప్రచురణము వరకు) మా కార్యాలయముచేరి మాకానందాన్ని సమకూర్చాయి. అయిదు, ఆరణాలకన్న ఎక్కువకాని స్వల్పవెలలకు, ఇంత చక్కని గ్రంథాలను ఇవ్వడం ప్రశంసాపాత్రం. ప్రజలకు—వినోదం కలిగించడంవల్ల గ్రంథమాలను అభివృద్ధి చేసుకొనేదృష్టి ప్రకాశకులకులేదు. ప్రజలకు ఈ దినాలలో అత్యావశ్యకమయిన విజ్ఞానం కలిగించాలి అన్న దృఢసంకల్పం ప్రతి ప్రచురణమునందు ప్రస్ఫుటంగా కనబడుతూఉంది. హైందవ ధర్మవీరులు, ప్రాథమిక స్వత్వములు, ప్రజలు ప్రభుత్వము, ఔంధు సంస్థానము, కమాల్ పాషాజీవితము మొదలయిన పేరులే దీనికి నిదర్శనము. ఇలాంటి సంకల్ప ముండడంవల్లనే ఈ గ్రంథమాల ఆదరణయోగ్యం అవుతుంది ఆంధ్రులందరికి. దీనికితోడు శైలిసుబోధంగాఉండి, ప్రతి అక్షరంలోనూ ఉత్సాహపూరితమయిన హృదయం కనబడుతూ ఉండడంవల్ల పుస్తకం తెరచింది మొదలు సంపూర్తిచేసినంతవరకు విడిచిపెట్టడానికి వీలుండదు. మల్లంపల్లి సోమశేఖరశర్మ, డాక్టరు పట్టాభి సీతారామయ్య మొదలయిన ప్రముఖుల ఉపోద్ఘాతాలతోనూ, సురవరము ప్రతాపరెడ్డిగారి వంటి ప్రజ్ఞావంతుల రచనలతోనూ అలరారుతున్న ఈ గ్రంథమాల త్వరలో ఆంధ్రులందరి ఆదరమును పొందుతుందనీ, ఇంకా ఇలాంటి గ్రంథరాజాలతో ఆంధ్రులకు విజ్ఞానదానం చేస్తూఉంటుందనీ నమ్ముతున్నాము. వలయువారు దేశోద్ధారక గ్రంథమాల, ఇమాంబావివీధి, సికింద్రాబాదు అని వ్రాయాలి."

—'కాగడా' ౧౪ ఫిబ్రవరి ౧౯౪౦ బుధవారము

ప్రీమియర్ ప్రెస్, సికింద్రాబాద్.

# పత్రికాభిప్రాయములు

## హైందవ ధర్మవీరులు

### గ్రం: సురవరము ప్రతాపరెడ్డిగారు, బి. ఏ., బి. ఎల్.

భారతి—యోధుల చరిత్రలను చక్కని భాషలో హృదయరంజకముగా వ్రాశారు.

గృహలక్ష్మి—హిందూదేశమున వివిధప్రాంతములనుండి యందలిచరిత్రములనుండి సంగ్రహించి కొందరి వీరుల గాథలను బాలబాలికలకుగూడా నర్థమౌనట్లు తేటతెలుగున వ్రాసినారు.

ఆంధ్రవారపత్రిక—ఈగాథలు చదివినకొలది పాఠకులకు ప్రాచీనవైభవము, మనపతనము కన్నులకుగట్టినట్లు గోచరించి రక్తము నుడుకెక్కకమానదు.

ఆంధ్రవాణి— ఆసేతుహిమాచలము నొక్కసారి సింహావలోకనమొనర్చి జాతి, మతవివక్షతలేకుండ చరిత్రలనుండి రసగుళికలనేరి మన కందించినారు.

గోలకొండపత్రిక—వీరగాథలు మేనులు పులకరించునట్టి వచనములతో వర్ణింపబడియున్నవి.

ప్రజామిత్ర—పెద్దలకూ, పిన్నలకూకూడ సుబోధకంగా ఉండే ఒక సారస్వతభూషణము.

విభూతి—హిందూదేశ గతపరాక్రమము దెలియదలచినవారు ఈపొత్తము తప్పక నవలోకించవలెను.

దక్కన్ క్రానికల్— జాతి మత విమక్షతలేక హిందూదేశముయొక్క గొప్పతనమును చాటు మహాపురుషుల జీవితములుగల పైగ్రంథమువంటి ప్రచురణములు హిందూదేశమునకు-ముఖ్యముగా ఈరాష్ట్రమునకు ప్రస్తుత పరిస్థితులందు—మిక్కిలి ఉపయోగకరములు.

తెలుగుతల్లి—జనుల కుత్సాహమొసగు పురికొల్పుటలో నీగ్రంథము గొప్పదనియే చెప్పవచ్చును. సవిస్తరముగ ప్రతివీరుని జీవితమిందు తెల్పిరి.

ప్రబుద్ధాంధ్ర—అసహాయశూరులైన జాతీయయోధుల సాహసకృత్యాలు ఇందులో వర్ణించబడ్డాయి. చక్కని గ్రంథము.

**వెల ౬ అణాలు.**

# పత్రికాభిప్రాయములు

## ప్రాథమిక స్వత్వములు

### గ్రం: సురవరము ప్రతాపరెడ్డిగారు, బి.ఏ., బి.ఎల్.

భారతి—ఇది ప్రతిరోజు ప్రతియాంధ్రుడు పారాయణంచేయదగిన గ్రంథం. ధార్మికగ్రంథపారాయణంవలన ధార్మికభావాలు గట్టిపడేలాగు ఈ గ్రంథపారాయణంవల్ల రాజకీయ, ఆత్మీయ, స్వాతంత్ర్యం భావాలు గట్టిపడుతాయి.

గృహలక్ష్మి—ప్రాథమికహక్కులు దేశదేశాలలో ప్రజలెట్లు సంపాదించిరో బాగుగా వివరింపబడియున్నదీగ్రంథములో.

ఆంధ్రవారపత్రిక— స్వాతంత్ర్యోద్యమము తెలియగోరువారికిది చాల ఉపకరించును.

నవశక్తి—స్వాతంత్ర్యహక్కులు పోరాటము, మానవుని పౌరస్వత్వ హక్కులసంపాదన ఈ పుస్తకములో సింహావలోకనముంది.

ఆంధ్రవాణి—స్వాతంత్ర్యకాంక్షగల ప్రతివారు చదువతగినపుస్తకం.

గోలకొండపత్రిక—రాజకీయాందోళనలు, విప్లవములు ఎట్లున్నను ప్రాథమిక స్వత్వములకు భంగకరము కలుగరాదనుభావము వ్యాపించుచున్న నీకాలములో ప్రాథమికస్వత్వములననేమో ప్రతిరాష్ట్రీయుడు తెలిసికొనియుండుట ముఖ్యము.

విభూతి— రాజకీయములు తెలిసికొనవలయునన్నచో ప్రథమపుస్తకమిది యనవచ్చును.

సందేశము—భారతదేశమున అన్నిభాగములందు ప్రాథమిక సత్వములకై పోరాటము జరుగుచున్న ఇట్టి సమయములో ఈపుస్తకము విలువ వేరుగ చెప్పనక్కరలేదు.

దక్కన్ క్రానికల్— పౌరస్వత్వమును వృద్ధినొందవలయునన్న ఈ గ్రంథమును పారాయణగ్రంథముగా ఉపయోగించుకొనవలయును.

తెలుగుతల్లి—ఇట్టి రాజకీయ పరిజ్ఞానము కలుగజేయు పుస్తకము ఇంత స్వల్పవెలలో చిక్కుటకష్టము.

ప్రబుద్ధాంధ్ర—ప్రజలందరూ-ముఖ్యంగా నియంతలదృష్టిలో పురుషుల కంటెనికృష్టులయివున్న కాంగ్రెసు ముస్లిములందరూ చదవతగ్గగ్రంథం యిది.

[illegible]

# పత్రికాభిప్రాయములు

## కమాల్‌పాషాజీవితము

(రెండుభాగములు)

గ్రం: ఖం. బాలేందు శేఖరముగారు, బి. ఏ., [ఆనర్సు]

గోలకొండపత్రిక—పరిస్థితులెంత విషమముగనున్నను, స్వదేశమోక్షణ సాధనమే పరమధర్మముగ బెట్టుకొని ఉపజ్ఞతో కృషిసల్పినచో క్రియాసిద్ధ మగుటు నిశ్చయమను ధర్మరహస్యమును ఈగ్రంథము చక్కగాచాటుచున్నది.

ఆంధ్రవార—మతోన్మాదములో మునిగిపోయినట్టి వారికి ఇది విధిగా వివేచనను గలిగించి తీరును.

విభూతి—రాజకీయమే పరమావధిగ నమ్మబడుచున్న యీకాలపు యువకు లెల్లరు కమాలుచరిత్రనుండి గ్రహించవలసిన యంశములు పెక్కుగలవు.

సందేశము—ఇంతత్వరిత ధరలో ఇంతటి ఉత్తమ గ్రంథము ఇన్నిపుటలు గలది తెలుగులో ఎన్నడును ప్రచురింపబడలేదనియే చెప్పవచ్చును.

దక్కన్ క్రానికల్—ఇటువంటివీరుల జీవితము ఎవరిని ఆకర్షించదు? అందరికిని తెలియునటుల సులభమైన తేటతెనుగులో వ్రాయబడినవి. ప్రతి వారు తప్పక చదువతగినవి.

గృహలక్ష్మి—ఈ ఉత్తమపురుషుని ఆదర్శచరిత్రను ఆబాలగోపాలానికి అర్థమయ్యేటట్లు మంచి ఆవేశపూరితమైన జిగితో వ్రాసారు గ్రంథకర్తగారు.

తెలుగుతల్లి—తుర్కీదేశమును ఉద్ధరించి పునర్జన్మ ఇచ్చుటయేగాక ఇస్లాము మతాచారములను ఆధునిక పరిస్థితుల కనుగుణముగ సంస్కరించి మార్గదర్శకులైన ముస్తఫాకమాలుపాషాజీవితము రెండు గ్రంథములలో సమగ్రముగా, సమర్థతతో వ్రాసి ఆంధ్రుల కృతజ్ఞతకు పాత్రులైనారు.

వెలగవి అణాలు

# పత్రికాభిప్రాయములు

## ప్రజలు—ప్రభుత్వము

### గ్రం: కౌంటులియోటాల్‌స్టాయ్

గోలకొండపత్రిక—గ్రంథమందలి విషయాలు ఆధునిక నిరంకుశ దేశాల ప్రజలకు చాలా ఉపకరించునట్టిది. ప్రతి విజ్ఞానప్రియుడును తప్పకుండా మనసుపెట్టి చదివి అర్థముచేసికొని లాభముపొందదగిన గ్రంథము.

తెలుగుతల్లి—ప్రజల సదభిప్రాయముపైన ఆధారపడినట్టియు, స్వార్థపరులచే నడుపబడునట్టియు ప్రభుత్వములందలిలోపము లీగ్రంథములో చర్చించబడినవి. ఇట్టి దుష్టప్రభుత్వపద్ధతుల నెదుర్కొను విధానముకూడ సూచింపబడినది. అనువాదము సరళశైలిలో ఉన్నది.

విభూతి—ప్రజలు-ప్రభుత్వము అనుద్వంద్వమునుగూర్చిన అనుకూల, ప్రతికూల విషయములను చర్చించి ప్రజాసేవకుల విధానమును ఉద్బోధమగురీతిని సూచించుచున్నది. ఇది రాజకీయరంగమునకేగాక సామాజిక జీవితమునకును ఉపయుక్తముగనున్నది.

## వెల ౬ అణాలు

---

## బౌంధుసంస్థానము

### గ్రం: పులిగడ్డ వెంకట సుబ్బారావుగారు, బి. ఏ.,

సు. ప్రతాపరెడ్డిగారు—దేశీయ సంస్థానప్రజలీ గ్రంథమును బాగుగా చదివి లాభమును పొందుదురుగాక!

హైదారాబాదుబులెటిన్—సంస్థానప్రజలు కన్నులువిప్పి తమకు కావలసిన దానినిగ్రహించి అడుగ నేర్చిన ఈరోజులలో ప్రకటింపబడుట మిగుల ముదావహము.

విభూతి—క్రొత్తగా స్థాపింపబడిన ఖాన్యతాయుత ప్రభుత్వమునుగూర్చి గ్రంథకర్తగారు సముచితముగ సంక్షేపించి యాంధ్రులకు సమర్పించి కృతజ్ఞతకు బాత్రులైనారు.

## వెల ౫ అణాలు

# వెలువడనున్న గ్రంథములు

---

సంస్థానప్రజల స్వాతంత్ర్యసమరము
దేశీయ సంస్థానములు-ఫెడరేషను
నిత్యజీవనమందు విజ్ఞానశాస్త్రము
గాంధివాదము - సామ్యవాదము
హైద్రాబాదురాజ్యాంగ చరిత్ర
భారతజాతీయోద్యమ చరిత్ర
బాధ్యతాయుత ప్రభుత్వము
దేశీయ సంస్థానములచరిత్ర
ఝాన్సి లక్ష్మిబాయి
ప్రజాజీవనసమస్యలు
అహింసాప్రభావము
గ్రామజనదర్పణము
నేటిమనగ్రామాలు
జాగీర్ల పరిపాలనము
గాంధీమహాత్ముడు

---